# దృష్టి



"కొలకలూరి"






ఉమా పబ్లిషర్సు
విజయవాడ-1.

1. త్యాగి

2. జ్యోతి

3. దృష్టి

# పూజ పూలు

కల్పన కల్పవల్లి పూలు పూసింది.

వేయి రేకుల మల్లెమొగ్గ వికసించింది. లోకం వైపు చూపు ప్రసరించింది.

ఊరికి దూరంగా పూరిపాకలు. పంచములు నివసించే ప్రదేశం.

"మానవులుసమానులు. హెచ్చుతగ్గులు లేవు. సృష్టిలో లేని భేదాలు సమాజంలో ఎందుకుండాలి! మానవతా సంఘ నిర్మాణం జరగాలి!"

మల్లెమొగ్గ చల్లచల్లగా నవ్వింది. అది త్యాగి.

పొగడ పువ్వు వెన్నెల హాసించింది. పుడమి పుణ్యాల పంట దర్శించింది.

నవ్వు చంద్రికల పసిపాప పాలబుగ్గలు చిదుముతోంది మాతృమూర్తి.

అందాల అన్నయ్య ఆటపాటల ఆనందంతో కేరింతలు కొడుతోంది లేతచేతుల చెల్లి.

చిన్ని పిల్లలతో ఆడుకొంటున్న ముసలి తండ్రిని చూచి తన్మయురాలవుతోంది కుమార్తె.

హృదయేశ్వరుని చూపులో అమరలోక తేజోమయూఖాలు తిలకించింది భార్య.

"స్త్రీ హృదయంలోని నిసర్గమనోజ్ఞ ప్రేమకు నాల్గు వాహినులు"

పొగడపువ్వు తియ్యతియ్యగా పలికింది. అది జ్యోతి.

"ముద్దబంతి మురిసింది. ముచ్చటగా పలికించింది.

రవి ప్రకృతి సుందరత వీక్షించాడు. అది బాహిర దృష్టి.

కవి ఆత్మసౌందర్యం సమీక్షించాడు. ఇది అంతర దృష్టి.

"ద్వివిధ దృక్కుల కలయిక హిమాన్విత మహిమాలయం."

ముద్దబంతి ముద్దు ముద్దుగా చూచింది. అది దృష్టి.
కల్పన కల్పవల్లి పూలుపూసింది.

1-1-1960 కొ ల క లూ రి.

నా కు

సాహిత్యంలోనూ, జీవితంలోనూ

వెలుగు బాట చూపిన

మ నీ షి

మంజుల భావ మార్దవార్ద్రి హృదయులు

మా

గు రు దే వు లు

కరుణశ్రీ. జంధ్యాల పాపయ్యశాస్త్రి గారికి

అం కి తం

శ్రీ బండా కనకలింగేశ్వరరావు గారికీ,

బ్రహ్మశ్రీ స్థానం నరసింహరావు గారికీ,

ధన్యవాదాలు.

శ్రీ కే. వి. గోపాలస్వామినాయుడు గారికీ,

శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారికీ,

శ్రీ కొర్లపాటి శ్రీరామమూర్తి గారికీ,

కృతజ్ఞత.

ప్రథమ బహుమతి

ఆంధ్రా యూనివర్సిటీ ఆంధ్ర భాషా సమితి
నాటికల పోటీలో
1957–58

# త్యాగి

[ వరండాగది. ఎడంవైపు మేడమీదికి మెట్లు. కుడివైపు రోడ్డుమీదికి వాకిలి. ఎదురుగా వాలికి. వాకిలి రెండు ప్రక్కలా రెండు కిటికీలు. కిటికీలమీద వ్రేలాడుతూ రెండు పటాలు. వాకిలిమీద పటం పెట్టటానికి వీలుగా మేకు వుంది. కిటికీలపై పటాలకు అంకు ముందు రోజు వేసిన పూలదండలు వాడిపోయి వున్నాయి.

గది మధ్య టేబిల్ దగ్గర రెండు కుర్చీలు. మెట్లు దగ్గరగా సోఫావుంది. టేబిల్ నీటుగా వుంది. గదిలో పటాలు తప్ప అంతా శుభ్రంగా అందంగా వుంది.

తెర లేచేసరికి ఖాళీగావున్న హాలులోకి హేమలత ఎదురు వాకిలినుంచి వచ్చింది. అందమైన ఆకారం. కుదిరిగ్గా బట్టలు ఉత్సాహంగా వ్యక్తి. సౌమ్యంగా ముఖం. ]

హేమ: (పటాలు చూచి, లోపలికి చూస్తూ) సుబ్బన్నా! సుబ్బన్నా!!

సుబ్బ: (లోపల్నుంచి) అమ్మా.

హేమ: ఇటురా! సుబ్బన్నా!!

సుబ్బ: వస్తున్నానమ్మా!

హేమ: ఇంతసేపా?

సుబ్బ: ఇదుగో! చెప్పండి.

హేమ: (పూలదండలు చూపుతూ) ఇవీ ఇక్కడ పెట్టావేం? అలంకారం చేయించలేదేం?

సుబ్బ: రవిబాబు ఇంకా ఇటురాలేదు.
హేమ: బాబూ! — రవీ!!
రవి: ఏమిటమ్మా!
హేమ: ఇటురా బాబు.
రవి: వస్తున్నానమ్మా!
హేమ: పూలదండలు వేయలేదేం?
రవి: మర్చిపోయానమ్మా!
హేమ: తప్పు అలా మర్చిపోకూడదు.
రవి: (బెంచీ ఎడంవైపు కిటికీదగ్గరకు లాగి పూలమాల వేస్తాడు)
హేమ: తాత ఏమంటున్నాడు.
రవి: నవ్వుతూ వున్నాడు.
సుబ్బ: (కుడివైపు కిటికీదగ్గరకు లాగాడు బెంచీ) రా బాబూ!
రవి: (పూలమాల వేశాడు)
హేమ: నాన్న అమ్మ నవ్వుతోందా?
రవి: ఎప్పుడూ నవ్వుతూనే వుంటుంది.
సుబ్బ: దిగు బాబు.
రవి: తాతయ్యా!
హేమ: (బాధగా) తాత! తాత!!
సుబ్బ: అదేమిటమ్మా!
హేమ: సుబ్బన్నా మా నాన్న ఫోటో అయినా నీ దగ్గర లేదా?
సుబ్బ: ఎందుకు లేదమ్మా! – ఆయన చిత్రపటం నా హృదయంలో ఎప్పుడూ వుంటుంది.

హేమ: నాన్న విషయం తల్చుకున్నప్పుడల్లా నాకు చాలా బాధగా వుంటుంది.

సుబ్బ: ఎందుకమ్మా బాధ. ప్రతి చిన్న విషయానికీ బాధ పడితే జీవితంలో సుఖమే వుండదు.

హేమ: ఏమిటో - వారింకా రాలేదు. ఏం తీరని పనులో! అబ్బా!

రవి: నాన్న ఎక్కడికి పోయారమ్మా!

హేమ: ఆఫీసుకి. తొందర్లోనే వస్తారు రవీ!

రవి: ఏమిటమ్మా అలావున్నావ్!

హేమ: ఏమీ లేదు బాబు. - సుబ్బన్నా మా నాన్న బ్రతికే వున్నారా!

సుబ్బ: అవును.

హేమ: నిజంగానా?

సుబ్బ: ముమ్మాటికీ నిజం.

హేమ: నాకెందుకో నమ్మకం లేకుండా వుంది.

సుబ్బ: అమ్మా! నా జీవితంలో నేను మరొకరికి నౌకరీ చేయ లేదు. నేను మీ దయను సంపాదించుకున్నాను. మిమ్మల్ని ముద్దుగా పెంచాను. ఇన్నాళ్ళకు యీ ముసలి నౌకరుమీద విశ్వాసం సడలిపోయిందా తల్లీ!

హేమ: మా నాన్నను నేను ఎప్పుడో చిన్నప్పుడు చూశాను. మళ్ళీ చూడలేదు. మా నాన్న బ్రతికి వుండటం విషయంలో అనుమానం కాని నీ మాటమీద కాదు సుబ్బన్నా!

సుబ్బ: రాఘవయ్యగారు బ్రతికి వున్నారు. ఎక్కడున్నారో నాకు తెలియదు.

హేమ: నాన్న బ్రతికి వుండటం తెలిస్తే ఎక్కడ వుంది కూడా తెలుస్తుంది చెప్పు సుబ్బన్నా! నాన్న ఎక్కడ వున్నారు. నాన్న మనల్ని చూడకపోయినా మన మయినా నాన్నను చూద్దాం.

సుబ్బ: నాకు తెలియదు.

హేమ: నీకు తెలుసు. ఎందుకో దాస్తున్నావ్! దాయకు సుబ్బన్నా చెప్పు.

సుబ్బ: తెలియదమ్మా! తెలిస్తే చెప్పకుండా వుండను (బాధ పడతాడు.)

హేమ: తెలియదు కదూ!

సుబ్బ: (చూచి బాధగా తలవూపి ఎదురు వాకిలిగుండా లోప లికి పోయాడు. సుబ్బన్న తిరిగి వచ్చాడు.) మీ నాన్నగారి చిత్రపటం ఇదుగోనమ్మా!

హేమ: మా నాన్న చిత్రపటం.

సుబ్బ: అవునమ్మా!

హేమ: (తీసుకుని చాలాసేపు చూచి) మా నాన్న బాబూ రవీ! ఈ పటం మా నాన్నది బాబు.

రవి: (సోఫాలో ఏదో చదువుకుంటూ వున్నాడు. లేచి పటం తీసుకు చూచి) తాతగారు బాగున్నారమ్మా!

హేమ: బాబు! ఆపటం వాకిలిమీద మేకుకి తగిలించు.

రవి: అల్లాగేనమ్మా! మరి పూలదండ లేదు ఎలా?

హేమ: ఇవాల్టికి ఫరవాలేదు. రేపట్నించి అలంకరిద్దాం.

రవి: సరే (తగిలించాడు) (మేడమీాదికి వెళ్ళాడు.)

సుబ్బ: మీానాన్న నాదగ్గర ఒకమాట తీసుకున్నాడు. ఆయన ఎప్పుడు ఎక్కడ వుందీ మీాకు చెప్పవద్దు అని. ఆయన్ను గూర్చిన ఏ విషయమూ మీాకు తెలియనివ్వవద్దు అని కూడా చెప్పారు. అందువలన ఆయన విషయం మీారు బలంగా అడుగుతూవున్నా నేను చెప్పలేదు. కారణం వారికి నేను ఇచ్చిన మాట నిలబెట్టుకోవటం కోసం. నన్ను ఇంక మీారు అడగవద్దు.

హేమ: నాకింకెప్పటికీ నాన్న కనిపించడా సుబ్బన్నా!

సుబ్బ: మీానాన్న మీాకు తప్పక కనిపిస్తారు. అంటే నేను చెప్పకూడని విషయం మీాకు చెప్పానన్నమాట! ఇంకొక్క సంగతి ఆయన ఇవాళ వస్తున్నారు. మిమ్మల్ని చూడాలనే కోర్కెతో వస్తున్నారు. మీా నాన్నను మీారూ చూద్దురుగాని లెండి!

హేమ: (ఆనందంతో) నిజంగానా?

సుబ్బ: నిజంగానమ్మా!

విశ్వనాథరావు (ప్రవేశం)

హేమా! హేమా!

సుబ్బ: వచ్చారా బాబు!

హేమ: రండి.

విశ్వ: రవీ! బాబూ!!

రవి: (పైనించి) నాన్నా! (మెట్లు దిగి వచ్చాడు)

విశ్వ: హేమా! హుషారుగా వున్నట్లుంది.

హేమ: అవునండి!

విశ్వ: ఆవేశంగాని రాలేదు కదా!
హేమ: ఊఁ! (భయంగా సిగ్గుపడి నవ్వింది)
విశ్వ: (నవ్వాడు)
రవి: నాన్న! (చేతి బిస్కట్లు లాక్కున్నాడు)
విశ్వ: (టేబిల్ ముందు కుర్చీలో కూర్చున్నాడు)
హేమ: (పక్కనే కూర్చుంది)
రవి: (సోఫాలో కూర్చున్నాడు)
సుబ్బ: (ఎదురు వాకిలి దగ్గర నిలబడ్డాడు.)
విశ్వ: ఇవాళ ప్రపంచ చరిత్రలో ఒక నూతన అధ్యాయం ప్రారంభమయింది.
హేమ: ఏ విషయమండీ!
విశ్వ: ఏమిటి హేమా అలా అడిగావ్!
రవి: నాన్నా మరి......
విశ్వ: బాబు నీ చరిత్ర పుస్తకంలో కొన్ని క్రొత్త పుటలు ఇవాళనుంచి చేరుతాయి. ప్రపంచ మానవతా చరిత్రలో ఒక శుభోదయం ఇవాళ జరిగింది.
హేమ: ఆయుధ విసర్జన విషయమేనాండి!
విశ్వ: అవును. అమెరికా రష్యాలు అగ్రరాజ్యాలమనుకుని పోటీలుపడి మారణాయుధాలు సమకూర్చుకొని నాశనం వైపు నడుస్తూ ప్రపంచం బూడిదను పరిపాలించాలని పగటి కలలు కన్నాయి.
హేమ: దేశం శాంతి విలువ గ్రహించింది.
విశ్వ: అహింస జయిస్తుంది కనుకనే హింసావాదులు చేతులు ముడుచుకున్నారు.

హేమ: అమెరికా రష్యాలు ధర్మం సాక్షికంగా ఆయుధ విసర్జన చేశాయి. రెండు దేశాలమధ్య సంబంధ బాంధవ్యాలు కలగబోతున్నాయి.

విశ్వ: ఇది శుభసమయం అన్ని దేశాల మానవులు ఐకమత్యంతో ఇంక ముందు ప్రగతిలో భవిష్యత్తు బాట నిర్మించుకుంటారు.

హేమ: ఇవాళ ఎంత మంచి రోజో!

విశ్వ: ప్రపంచం ఈనాడు పండుగ చేసుకుంటుంది. ప్రపంచంలో ప్రతి ప్రాణీ ఆనందంగా జరుపుకుంటున్న పండుగ ఇదొక్కటే.

రవి: నాన్నా!

విశ్వ: ఏం రవీ!

రవి: ఇప్పుడే అందరూ పండుగ చేసుకుంటారా?

విశ్వ: అవును బాబు.

రవి: నాన్నా! మరే - అందరికీ ఇప్పుడు పండుగ కాదుగా:

విశ్వ: అదేమిటి రవీ!

రవి: మనం పగలు పండుగ చేసుకుంటాం. రాత్రి చేసుకోం.

విశ్వ: అవునూ!

రవి: ఇప్పుడు మనకు పగలు ఆనందంగా వుంటాం. మరొక దేశంలో చీకటి. వాళ్ళు పండుగ చేసుకోరా?

విశ్వ: పండుగ ఇరవై నాలుగు గంటలు బాబు. ఒక రాత్రీ ఒక పగలూ వుండటంచేత వేడుకకు వీలుగానే వుంటుంది.

సుబ్బ: రవీ! పగలే పండుగ చేసుకోగలం. చీకట్లో వీలులేదు. అయినా పండుగ కాలంలో కష్ట సుఖాలులాగా రాత్రీ పగలూ వున్నాయికదా!

రవి: తాతయ్యా!

సుబ్బ: రా బాబు! కొంత మందికి చీకటి ముందు మరికొంత మందికి వెలుగు ముందు. పండుగ అయింతరవాత కొందరికి చీకటి వస్తుంది. చీకటి గడిచిం తర్వాత మరి కొందరికి పండుగ వస్తుంది.

రవి: అలా ఎందుకని తాతయ్యా!

సుబ్బ: అది వాళ్ళున్న ప్రదేశమూ, పరిస్థితీ వీటిమీద ఆధార పడి వుంటుంది. ఒకళ్ళ గొప్పతనంగాని మరొకళ్ళ తక్కువదనంగాని ఇందులో ఏమీ లేదు.

రవి: ఏమిటి తాతయ్యా! నాకు ఏమీ తెలియటంలేదు.

సుబ్బ: ఏనాడో తక్కువ కులం అని పిలవబడిన పంచములు చాలా కాలంనుంచి తక్కువ కులంవాళ్ళు కాదు. వాళ్ళూ అభివృద్ధి చెందారు.

రవి: అయితే ఏమిటి తాతయ్యా!

హేమ: నాకివాళ చాలా ఆనందంగా వుంది.

విశ్వ: ఆనంద సమయమే కాని, ఈ సమయం ఇంట్లో పెద్ద వాళ్లు లేని మనం ఏం ఆనందం అనుభవించగలం? మనల్ని దిక్కులేని వాళ్ళను చేసి వాళ్ళు స్వర్గంలో వున్నారు.

సుబ్బ: మీకేమిటి బాబు దివ్యమైన జీవితం. మీరు బాధ పడవలసిన స్థితికాదు.

హేమ: మనం దిక్కులేని వాళ్ళం కాదండీ!
విశ్వ: ఏమిటీ?
హేమ: మా నాన్న బ్రతికి వున్నారండి.
విశ్వ: నిజంగానా!
హేమ: నిజమండి. ఇవాళ మనం హాయిగా వున్నందుకు ఆనందం కలుగజేయటానికి మన గృహం పావనం చేయటానికి మా నాన్న వస్తున్నారు.
విశ్వ: నేను పోయి వారిని తీసుకు వస్తాను. వారిని చూడాలని హృదయం ఆరాట పడుతోంది. ఎక్కడున్నారు చెప్పు హేమా!
హేమ: ఎక్కడున్నారో నాకూ తెలియదు. వారిని చూడా లనుకుంటే ఇప్పటికిమాత్రం ఆ పటం వుంది.
విశ్వ: (లేచి చూచి) శివిగా వున్నారు. (ఆనందంగా) ఇవాళ వస్తారా? ఇన్నాళ్ళూ ఎక్కడున్నారు మీ నాన్న! చెప్పు హేమా?
హేమ: ఏమో నాకు తెలియదండి! నాకు తెలిసింది మీకు చెప్పాను.
విశ్వ: మీ నాన్న బ్రతికి వుంటే కనీసం ఏ పరిస్థితిలో వున్నా, మన పెళ్ళికి ఆయన వచ్చివుండాల్సింది.
హేమ: ఏమో, ఎందుకు నాన్న మనకు దూరంగా వుంటు న్నారో నాకు అర్థం కావటంలేదు.
విశ్వ: వారు బ్రతికి వుంటే వుండరు. పటం ఎక్కడిది?
సుబ్బ: బ్రతికే వున్నారు. సుబ్బన్న తెచ్చాడు.
విశ్వ: నీకు తెలుసా?

సుబ్బ: తెలుసునండి. అమ్మాయిని, తననిగూర్చి ఏవిషయమూ తెలియనీయకుండా పెంచి పెద్ద చేయటంలో వారికొక కోరిక ఆశయం వున్నాయి. అవి నెరవేర్చుకున్నారు. నెరవేరిన ఆశయానికి భంగం వాటిల్లకుండా వుండేందుకు దూర దూరంగా వుంటూ వచ్చారు. ఇవాళ వస్తున్నారు. ఆయన ఎందుకు అలావుండవలసి వచ్చిందో మీకే తెలుస్తుంది. ఆయనచేసిన పనిమాత్రం చెడుకాదు. (లోపలికి పోయాడు)

విశ్వ: ఏమిటి హేమా!

హేమ: ఏమిటో నాకూ అర్థం కావటం లేదండి.

రవి: ఏమిటి నాన్నా అది!

విశ్వ: ఏమీ లేదులే బాబు. మీ తాతవిషయం మాట్లాడుకొంటున్నాం.

(రాఘవయ్య ప్రవేశం:)

విశ్వ: ఎవరు మీరు?

రాఘు: (పలకడు)

హేమ: ఎవరండీ మీరు? ఎవరికోసం.

రవి: ఆ పటంలాగా...నాన్నా ఆ పటం చూడు.

హేమ: అవును రవీ!

సుబ్బ: (వచ్చాడు) ఎప్పుడొచ్చారు బాబు!

రాఘు: ఇదే రావటం సుబ్బన్నా!

సుబ్బ: క్షేమంగా వున్నారా?

రాఘు: అవును సుబ్బన్నా!

సుబ్బ: అమ్మా మీ నాన్న అమ్మా! మిమ్మల్ని చూడ్డానికి వచ్చారు.
హేమ: మా నాన్నా.
సుబ్బ: అవునమ్మా!
విశ్వ: నాన్నా!
హేమ: (లేచిపోయి కాళ్ళు పట్టుకుని తల కద్దుకుంటుంది.)
రవి: ఎవరు తాతయ్యా!
సుబ్బ: తాతగారు బాబు.
హేమ: నాన్న ఇన్నాళ్ళు మాకు దూరంగా ఎందుకున్నావ్ నాన్నా!
విశ్వ: అవునండి మమ్మల్ని దిక్కులేనివాళ్ళనుచేసి మీ రెందుకు దూరంగా వున్నారు.
రాఘు: చాలా కారణాలు వున్నాయి. ఇప్పుడు నాకు అలసటగా వుంది. కొంచెంసేపు విశ్రాంతి తీసుకుంటాను.
విశ్వ: సుబ్బన్నా పైన గది కాళీచేసి వీరిని తీసుకుపో!
సుబ్బ: సరేనండి!

(విశ్వనాథరావూ, హేమలతా, రవిబాబూ లోపలికి పోయారు)

సుబ్బ: ఇంతకాలం మనం జాగ్రత్తగా దాచివుంచిన విషయం ఇవాళ తెలియజేస్తారా!
రాఘు: అవును.
సుబ్బ: మీరీసంగతి చెప్పటంతో వారి కుటుంబంలో ఎటువంటి పరిణామాలు వస్తాయో? వారి జీవితాలు ఎలా

మారుతాయో? బంగారు తల్లి భవిష్యత్తు ఏమవు తుందో?

రాఘు: ఎలాంటి విపరీతమూ జరగదనే వూహిస్తున్నాను. ఈ వ్యవహారం తెలపటానికి ఇంక ఆలస్యం చేయకూడదు. ఈ పరిస్థితి ఇందుకు అనుకూలమయిందే అనుకుం టున్నాను.

సుబ్బ: మీ యిష్టం.

విశ్వ: (వచ్చాడు) మీరు పడుకో లేదేం? సుబ్బన్నా గది శుభ్రం చేయ లేదూ!

సుబ్బ: చేయబోతున్నాను బాబు. (పైకి వెళ్ళాడు)

విశ్వ: మీరు పైకిపోయి విశ్రాంతి తీసుకోండి.

రాఘు: విశ్వం.

విశ్వ: ఏమిటండి?

రాఘు: నేను నీకు చాలా ముఖ్యమైన ఒక సమాచారం తెలియ జేయాలి.

విశ్వ: అదేమిటండీ! చెప్పండీ!

రాఘు: ప్రపంచం పుట్టినప్పుడు మొట్టమొదట పుట్టిన మాన వుడి కులం ఏమిటి అయివుంటుంది.

విశ్వ: అనాది మానవుడికి ఏకులమూ వుండటానికి వీల్లేదు.

రాఘు: అయితే ఒకప్పుడు లేని కులాలు మరొకప్పుడు ఎలా వచ్చాయి.

విశ్వ: సంఘం జీవితావసరాలు నెరవేర్చుకోటానికి ఏర్పరచు కొన్న కొన్ని సంకేతాలు కులాలు.

రాఘు: అప్పుడు సంకేతాలు ఏర్పడుతున్న సమయంలో సంకేతాలకు ఎక్కువ తక్కువ లున్నాయి.
విశ్వ: ఉండటానికి వీలులేదు.
రాఘు: ఇప్పుడు సమాజంలో వున్న కులాల విభేదాలు సమసి పోవటం అభ్యుదయ దృక్పథంలో మంచిదే కదూ!
విశ్వ: చాలా మంచిది.
రాఘు: ఈ విభేదాలు పోవాలి అంటే ఏమిచేయాలి.
విశ్వ: ఏమిచేయాలి అనేది అంత త్వరగా నిర్ణయించకూడదు.
రాఘు: నేను నీకు చెప్పాలి అనుకున్న సంగతి చెప్పనేలేదు. అనవసరంగా కాకపోవచ్చు, అయిన విషయం మరొక విధంగా ఎత్తుకున్నాను. చెబుతాను విను విశ్వం.
విశ్వ: చెప్పండి మీరు చెప్పే విషయం చాలా లోతుగా వుంది చెప్పండి.
రాఘు: అమ్మా నాన్నా లేని అందమైన ఒక అబ్బాయిని ఎవరో ముసలివాడు, తనెవరో తెలుపకుండా అమెరికాలో చదివించాడు. ఐ. ఏ. యస్ ఆఫీసరు అయ్యేదాకా అతనికి డబ్బు సహాయం చేశాడు.
విశ్వ: మీరు చెప్పేదానితో నాజీవితానికి ఏమైనా సంబంధం వుందా ?
రాఘు: ఏమో నాకేమీ తెలియదు. తెలిసిందిమాత్రం చెబుతాను జాగ్రత్తగా వినాలి విశ్వం.
విశ్వ: ఊఁ !
రాఘు: ఆముసలివాడు ఒక మాదిగ కులంవాడు. ఆ యువకుడు ఉన్నత కులంవాడు.

విశ్వ: అయితే...

రాఘు: యువకుడు ఉద్యోగం వచ్చింతరవాత ఒక అమ్మాయిని ప్రేమించి పెళ్ళి చేసుకున్నాడు.

విశ్వ: ఆయువకుడుకీ నాకు జీవితంలో పోలికలు వున్నాయి.

రాఘు ఆమె కులం అతనికి తెలియదు. ఆమె ముసలాడి కూతురు.

విశ్వ: ఇది పూర్తిగా నాజీవితమేనేమో అనిపిస్తోంది.

రాఘు: అతనికి ఒక పది సంవత్సరాల పాప వున్నప్పుడు ఆ ముసలాడు వచ్చి విషయం విడమర్చి పూర్తిగా చెప్పాడు.

విశ్వ: ఇది నాజీవితమా ?

రాఘు: కాదు. ఆయువకుడు ఆపైన ఎలా ప్రవర్తించివుంటాడు? ఏంచేస్తాడని నువ్వు వూహిస్తున్నావ్!

విశ్వ: అతనేమీ చేయలేక పోవచ్చు.

రాఘు: తనకుగాని తన కుటుంబానికిగాని ఏమైనా కష్టంగానీ నష్టంగానీ కలిగించుకొని వుంటాడా?

విశ్వ: అలాంటి పరిస్థితికి ఎలాంటి అవసరమూ లేదేమో నని పిస్తుంది.

రాఘు: అయితే ఆముసలి వాడిని నేను. ఆయువకుడివి నువ్వు.

విశ్వ: మీరా! నేనా?

రాఘు: అవును.

విశ్వ: నన్ను చదివించి నాకు తెలియకుండా పెద్ద చేసింది మీరా?

రాఘు: డబ్బు పంపిందిమాత్రం నేను విశ్వం.

విశ్వ; నాజీవితాంతం నేను మీకు కృతజ్ఞుణ్ని.
రాఘు; నేను పైకి వెళతాను.
సుబ్బ; (పైనించి దిగివచ్చి ఎదురు వాకిలిగుండా లోపలికి పోయాడు)
విశ్వ ఒక్కమాటండి!
రాఘు; ఏమిటది చెప్పు విశ్వం.
విశ్వ; మీరు చెప్పిన అన్ని విషయాలు నాకు వర్తిస్తాయి కదూ!
రాఘు; అవును.
విశ్వ; నా హేమలత కులం ఏమిటి.
రాఘు; తక్కువకులం - మాదిగ.
విశ్వ; (బాధగా) హేమా! (దిగులుగా పెద్దగా) హేమా!
(రాఘువయ్య మేడమీదికి పోయాడు)
హేమ: ఏమిటండి పిలిచారు - ఇదేమిటండీ విచారంగా వున్నారు. ఎందుకండి అలావున్నారు.
విశ్వ: (దూరంగా జరిగి బాధగా భయంగా) హేమా!
హేమ: (కంగారుగా) ఏమిటి మీరీ రోజు ఇలావున్నారు.
విశ్వ: హేమా! నీకులం ఏమిటి?
హేమ: (ఏడుస్తు) నాకేం తెలుసు.
విశ్వ: తెలియదా? తెలియదా హేమా??
హేమ: నాకు తెలియదని మీకు తెలుసు కదండీ!
విశ్వ: మీ నాన్నను అడుగు చెబుతాడు.
హేమ: మానాన్న. మీరు అడిగారా? ఏం చెప్పాడు. నా కులం ఏమిటి? చెప్పండి?

విశ్వ: (కదలకుండా కూర్చున్నాడు)
హేమ: మానాన్ననే అడుగుతాను.
విశ్వ: (మెట్లు ఎక్కుతున్న హేమలతను బాధగా చూస్తూ వుంటాడు)
సుబ్బ: (లోపల్నుంచి వచ్చి) ఏమిటి బాబూ విచారంగా వున్నారు.
విశ్వ: (ముఖంలోకి చూస్తాడు. మాటాడడు)
సుబ్బ: బాబూ!
విశ్వ: (తలవంచుకునే) ఏమిటి?
సుబ్బ: ఎందుకు విచారంగా వున్నారు?
విశ్వ: ఏమీలేదు.
సుబ్బ: ఎందుకో బాధపడుతున్నారు. చెప్పండిబాబు. నాకు చెప్పరా?
విశ్వ: నాతల పగిలిపోతున్న ఈస్థితిలో నేనేమీ చెప్పలేను. నన్నేమి బలవంతం చేయవద్దు
సుబ్బ: సరే మీయిష్టం బాబు.
(హేమ మెట్లు దిగుతూవుంది)
సుబ్బ: అదేమిటమ్మా నువ్వూ కళావిహీనమైన ముఖంతో వున్నావు?
హేమ: నాకర్మ!
సుబ్బ: అదేమిటమ్మా! ఏంజరిగింది.
హేమ: ఏమీ జరగలేదు. లేదు ఏమీలేదు సుబ్బన్న.
సుబ్బ: ఏదోవుంది. ఏమిటో తీస్తున్నారు. మీరు ఇద్దరూ అదోరకంగా వుండటానికి బలవత్తరమైన కారణం

ఏదో వుంది. ఏదివున్నా ఇంత ఖిన్నమై పోవాల్సినపని అనవసరం. అసలు ఏమయిందో చెప్పండి!

హేమ; నేను ఏం చెప్పగలను. ఏమీ చెప్ప లేను.

సుబ్బ; నేనేం చెయ్యాలో తెలియటంలేదు. నేను ఏం చేయ గలనో – మీకోసం – చెప్పండి!

హేమ; నాకు ఎవరూ ఏసహాయమూ చేయలేరు సుబ్బన్నా! నాకర్మ అలా కాలింది. (విశ్వనాధరావు దగ్గరకునడచి) ఏమండీ! ఏమండీ!!

విశ్వ; (పలకడు)

సుబ్బ; అమ్మ పిలుస్తోంది బాబు.

విశ్వ; వినబడుతూనే వుంది.

హేమ: నా పుట్టుకకు నేను కారణంగాను. మీకు కష్టం నావల్ల కలిగితే క్షమించండి! క్షమించరూ ?

విశ్వ: (మాటాడడు)

హేమ: నాకు తెలియకుండా నావల్ల అపరాధం జరిగింది. నాకు తెలియకుండా నేను మీకు చేసిన అపకారానికి నన్ను మన్నించండి. మన్నించారూ ?

సుబ్బ: ఏమి అపకారమమ్మా ?

విశ్వ: నా గుడ్డితనానికి, నాకళ్ళు కనిపించని పనికి నేను ఏడుస్తాను. గుండెలు పగిలేలా దుఃఖిస్తాను. నేను ఒకరిని క్షమించవలసిన పనేమున్నది. నువ్వూరుకో !

హేమ: నన్ను క్షమించాను అనండి. నాకు తృప్తి కలుగుతుంది. అనరూ ?

విశ్వ: (నిర్వికల్పంగా వుండుకుంటాడు)
హేమ: ఏమండీ!
విశ్వ: (చైతన్యం లేదు.)
హేమ: (క్రుంగిపోయి మరొక కుర్చీలో కూర్చుంది)
సుబ్బ: (మేడమెట్లు ఎక్కి వెళ్ళిపోయాడు)
(రవి ప్రవేశం)
రవి: అమ్మా,
హేమ: (చూచి, ఏడ్చి వుండుకుంది పలక లేదు.)
రవి: ఏమిటమ్మా! అమ్మా!!
హేమ: (భోరున ఏడ్చింది)
రవి: నాన్నా!
విశ్వ: (తల యెత్తడు)
రవి: మీ రందరూ ఏమిటి నాన్న (తట్టుతాడు)
విశ్వ: (చూచి వుండుకుంటాడు)
రవి: (ఏడుస్తూ) అమ్మా! నాన్నా!! ఇద్దరూ పలక రేమిటి?
ఏమటమ్మా! నాన్నా!!
సుబ్బ: (వచ్చాడు) ఎందుకు బాబు ఏడుస్తావ్. అనవసరంగా అందరూ విచారించటం దేనికి బాబు. ఒకరిమీద ఒకరికి వాళ్ళిద్దరికీ కోపాలు వచ్చాయి. రా! మనం లోపలికి వెళదాం.
రవి: అమ్మా! నాన్నా!! (వెళ్ళిపోయారు)
హేమ: బాబూ! రవీ!! (లేచి లోపలికి పోయింది)
రవి: (తెరలో ఏడుస్తూ) నాన్నా! నాన్నా!! ఎందుకు నాన్నా నన్ను ఏడిపిస్తున్నారు.

విశ్వ: వద్దు బాబు. నువ్వు వెళ్ళొద్దు.

(లోపలికి పోయాడు)

(రాఘవయ్య మెట్లు దిగాడు.
సుబ్బన్న వచ్చాడు)

సుబ్బ: చెప్పారు. వివరంగా చెప్పారు.

రాఘు: చెప్పాను.

సుబ్బ: వాళ్ళముఖాలు చూస్తూవుంటే హృదయం ద్రవించి పోతోంది. రాతిగుండె మనిషి తప్ప వాళ్ళ ముఖాలు చూడలేడు. వాళ్ళ మనస్సులు ఎంత మధనపడు తున్నాయో ఎంత బాధపడుతున్నాయో ఎంత ఆక్రో షిస్తున్నాయో ఎవరు ఊహింపగలరు?

రాఘు: మనం ఇప్పుడేం చేయగలం.

సుబ్బ: వాళ్ళు ఎలా కోలుకుంటారో పర్యవసానం ఎలా వుంటుందో నాకు భయంగా వుంది.

రాఘు: ఏం ఫరవా లేదనుకుంటున్నాను. ఎప్పటికైనా ఈ విషయం చెప్పక తప్పదు. అందుకే ఆలస్యం అయినప్పటికీ మరీ ఆలస్యం కాకుండా చెప్పాను.

సుబ్బ: ఈ విషయం ఎప్పటికైనా ఎందుకు చెప్పాలి?

రాఘు: చెప్పకపోతే ఎలా?

సుబ్బ: ఏం? ఏమవుతుంది? ఏం మునిగిపోతుం దనుకున్నారు. ఎందుకు తొందర పడ్డారు. ఎందుకు ఆలోచించలేదు.

రాఘు: చెప్పకుండా ఎంతకాలం వుంచగలం.

సుబ్బ: ఎంతకాలమైనా వుంచేవాళ్ళం.

రాఘు: అదే బాగా వుండేదేమో!

సుబ్బ: జరిగిపోయింది. చేతులు కాలిం తరవాత ఆకులు పట్టుకోవటం అనవసరం. అయినా ఇప్పుడేం చేయాలి అనేది ప్రశ్న. వాళ్ళు మామూలు మనుష్యులు కాగలరా? ఎప్పటికి? దేవుడా? ఏమిటీ విపరీతాలు.

రాఘు: నాకు కాళ్ళు నిలవటంలేదు.

సుబ్బ: నా బుర్ర తిరుగుతోంది. ఆలోచన పాడై పోయింది.

రాఘు: ఏమీ పాలుపోవటంలేదు. నేనేం చేసేట్టు

(పైకి వెళ్ళాడు)

విశ్వ: (వచ్చాడు. కూర్చున్నాడు.)

సుబ్బ: అయిపోయిం దానికి విచారించటం అనవసరం బాబు. మనస్సు కూడదీసుకోవాలి.

విశ్వ: హేమ కులం ఏమిటో తెలుసా సుబ్బన్న.

సుబ్బ: తెలుసు.

విశ్వ: రాఘవయ్యగారు చెప్పారా?

సుబ్బ; అవును.

విశ్వ: నేను పతనమైపోయానుకదూ!

సుబ్బ: లేదు బాబు.

విశ్వ: ఏమిటీ?

సుబ్బ: లోకంలో ఎంతమంది ఇష్టపూర్వకంగా తక్కువ కులం స్త్రీలను పెళ్ళి చేసుకోవటంలేదూ! అయినా అమ్మకు అన్ని సుగుణాలూ వున్నాయి. కులం ఆమెకు ఏమీ అడ్డంకాదు. మీరు కోరి చేసుకున్నారు. చేసుకునే టప్పుడు ఇలా అవుతుందని మీరు అనుకున్నారా? అది దేవుడి నిర్ణయం బాబు.

విశ్వ; ఇప్పుడు నే నేం చేసేది సుబ్బన్నా !

సుబ్బ; ఏమీ చెయ్యొద్దు. మామూలుగా వుండండి. అమ్మకు ఏమీ కష్టం కలిగించండి.

విశ్వ; నేనేం చేసేది. హృదయం ఉడికిపోతోంది. మనస్సు సమ్మె చేస్తోంది. శరీరం మండిపోతోంది. నరాలు పాముల్లాగా నృత్యం చేస్తున్నాయి రక్తంలో వరద వచ్చింది. వళ్లు కంపర మెత్తుతోంది. బుఱ్ఱ దిమ్మెత్తి పోయింది.

సుబ్బ; అంత బాధ పడాల్సింది ఏమీ లేదు బాబు.

విశ్వ; ఈ కష్టం నేను భరించలేను. చనిపోతానేమో సుబ్బన్నా !

సుబ్బ; తప్పు బాబు. అదేం మాట. అలా ఎప్పుడూ అనొద్దు.

విశ్వ: హేమతో నేను కాపరం చేస్తూవుంటే రోజు రోజుకి క్రుంగి క్రుంగి చనిపోతాను

సుబ్బ: నేను మిమ్మల్ని కాపాడగలను, మీకు ఏ ఆపదా వుండదు.

విశ్వ: లేదు. ఆమెతో నేను కాపరం చేయలేను.

హేమ: (వచ్చింది) నాతో కాపరం చేయలేరా ?

విశ్వ: ఆఁ !

హేమ: (ఏడుస్తూ ముఖం దించుకొని లోపలికి పోయింది)

సుబ్బ: బాబూ ! ఆమె కులమేగా మిమ్మల్ని భయపెడుతోంది.

విశ్వ: అవును.

సు'బ్బ: ఆమె కులం తెలియనప్పుడు ఆమెతో సుఖంగా కాపరం చేశారు. ఇప్పుడు చనిపోతానని బాధపడు తున్నారు. అన్నీ తెలిసిన మీరే ఇలా మాట్లాడితే మామూలు లోకం మాటేమిటి. మీకులం స్త్రీనే మీరు పెళ్ళిచేసుకుంటే మాత్రం సుఖంగా బ్రతకగల రని గ్యారంటీ ఏమిటి ? మూడుపూలు ఆరుకాయలుగా వున్న కుటుంబం నాశనం చేసుకోవద్దు.

విశ్వ: (బాధగా) సుబ్బన్నా !

సుబ్బ; మీరు అమ్మగార్ని పెళ్ళిచేసుకునే సమయంలో ఆమెది ఏకులం అనుకున్నారు.

విశ్వ; తక్కువ కులం అని మాత్రం అనుకోలేదు.

సుబ్బ; మీ వాక్యంలోనే ఆమె గొప్పతనం వుంది. అయినా గుణం ప్రధానం కాని కులం కాదు.

విశ్వ; ఏమిటో నువ్వు చెప్పేది.

సుబ్బ; రవీ! రవీ !!

రవి; (ఏడుస్తూ వచ్చి, చుట్టూ తిరుగుతూ వుంటాడు)

సుబ్బ; నిన్ను తాతగారు రమ్మన్నారు.

రవి; నన్నా.

సు'బ్బ; అవును.

రవి; తాతగారి దగ్గరకు వెళతాను. (వెళ్లిపోతాడు)

సుబ్బ; ఆగు బాబు (వెళ్ళాడు)

హేమ; (ప్రవేశం.) నాకులం కారణంగా మీరు బాధపడు తున్నారు కదూ !

విశ్వ; అవును.

హేమ; నాకులం మనల్ని వేరు చేస్తుందా? మీకు భార్యగా కలకాలం వుండే భాగ్యం నాకు లేదా? నేను ఆ అదృష్టాన్ని పోగొట్టుకున్నానా? అంతేనా?

విశ్వ; ఏమో!

హేమ; సరే (సరసన లోపలికి పోయింది)

సుబ్బ; (వచ్చాడు) ఎందుకు బాబు అనవసరంగా బాధపడతారు. ప్రతి చిన్న విషయానికీ విచారించటం చిన్న పిల్లల పని. మనం పెద్దవాళ్ళం. కంటనీరు పెట్టకూడదు. ఎల్లప్పుడు నవ్వుతూ వుండే మీ ముఖం విచారంతో నల్లగా చీకట్లు క్రమ్మినట్లు మబ్బు పట్టినట్లు దీపం ఆరి పోయినట్లు వుండటం నేను చూడలేను బాబు. మనం వూహించని సంఘటనలు లోకంలో ఎన్ని జరగటం లేదు. అన్నీ మనం పట్టించుకుంటే ఎలా. లే బాబు. మీరు మునుపు ఎంత హుషారుగానో వుండేవారు.

విశ్వ; అక్కర్లేదు. నాకేమీవద్దు. నాకెవరూవద్దు. నేనెవరికీ వద్దు నన్ను ఇలాగా ఇక్కడే వుండనివ్వండి!

సుబ్బ; మీ యిష్టం బాబు.

హేమ; (పెట్టితో వచ్చి) రవీ! రవీ!!

రవి; (పైనించి) అమ్మా! వస్తున్నా!!

విశ్వ; సుబన్నా! ఎక్కడికి హేమ వెళుతోంది?

సుబ్బ; ఎక్కడికమ్మా!

హేమ; నీకు నేను చెప్పను సుబ్బన్నా!

విశ్వ; హేమా! ఎక్కడికి?

హేమ; (పలకదు)
విశ్వ; ఎక్కడికి హేమా నువ్వెళ్ళేది?
హేమ; విశాల ప్రపంచంలోకి. రవీ! రవీ!!
రవి; వచ్చానమ్మా!
హేమ; (కుడిచేయి పట్టుకుంది. కంట నీరు పెట్టుకుంది.)
రవి; ఎక్కడికమ్మా!
హేమ; నాబాబూ నాతో వస్తావుకదూ! ఎవరికీ ఏ కష్టమూ కలిగించని ఏదో దూరా తీరానికి బాబు.
రాఘు; ఎక్కడికమ్మా!
హేమ; ప్రపంచంలోని సాగర తీరాల అవతలికి, ఉదయించే సూర్యుడిలో లీనం అయ్యేందుకు వీలున్న చోటుకి.
రాఘు; నేనూ నీతో వస్తాను వుండమ్మా!
హేమ; వద్దు. నాకోసం ఎవరూ బాధ పడవద్దు వద్దు, ఎవరూ ఏ కష్టమూ పొందవద్దు.
రాఘు; నీకు నేను నీడనమ్మా!
సుబ్బ; రవిబాబు మాతృమూర్తిని వదలి వుండడు. రవిబాబును వదలి నేను వుండలేను. అందుకే నేనూ మీతో వస్తాను.
విశ్వ; నన్నొక్కడ్నే ఒంటరినిచేసి, ఏకాకిని చేసి, హృదయం లేనివాడ్ని చేసి, నిరాశా పూరితుడ్ని చేసి మీరంతా కలసి ఎక్కడికి పోతారు. అలా వీల్లేదు. మీరెవరూ ఎక్కడికీ పోవద్దు. ఎవరూ వెళ్ళవద్దు. నన్ను చంప కండి. మీరంతా వెళితే నేను చనిపోతాను.

రాఘు; విశ్వం ఒక్కమాట.

విశ్వం; (చూస్తాడు)

రాఘు; లోకంలో పుట్టిన ప్రతివాడి నెత్తినా సమాజం ఏదో ఒక కులం అనే టోపీ తగిలిస్తుంది. అయితే రవి బాబుది ఏకులం. ఏకులం విశ్వం.

విశ్వ; ఏమో! ఏమో!! రవీ! బాబూ!!

రవి; (ఆశగా చూస్తాడు) నాన్నా!

హేమ; ప్రపంచంలో పశులకి ఏకష్టమూ కలక్కుండా బ్రతక టానికి వీలున్న చోటుకి ఈఅభాగ్యురాలు వెళ్ళిపోతుంది. మీ హేమను మరచిపోరు కదూ! సెలవు. (కదిలింది)

విశ్వ; హేమా! (సోఫాలోంచి లేచాడు) (రవి ఎడం చేయి పట్టుకొని) హేమ్మా నువ్వెక్కడికి వెళ్ళవద్దు. రవీ! బాబూ!! మీ రెవరూ నన్ను పిచ్చివాడ్ని చేసి వెళ్ళిపోవద్దు. సుబ్బన్నా వద్దు. రాఘువయ్యగారు వెళ్ళవద్దు. వద్దు. ఉండండి. అందరూ వుండండి. నన్ను బ్రతికించండి. హేమా నువ్వు లేకపోతే నేను బ్రతకలేను. నువ్వు ఏ కులమయినా అది నాకు అక్కర్లేదు. నువ్వు కావాలి. నీ పవిత్రమూర్తి నాకు కావాలి. నా బాబూ (రవిని ఎత్తుకున్నాడు.)

రాఘు; నేను మీకొక పీడకలని. ఇన్నినాళ్ళు మీకు లేని నేను ఇంక మీకు కనిపించను. మీజీవితంలో భయం కరమైన తుఫాను రేపి, అది చల్లారకముందే వెళ్ళి పోతున్నాను. నాకోసం ఎవరూ వెతకవద్దు. సుబ్బన్న

నన్ను మరచిపో! అమ్మా మీరు సుఖంగా వుండండి.
వస్తాను రవీ! సెలవు విశ్వం.

సుబ్బ; ఏమండీ!

హేమ; నాన్నా!

విశ్వ; మామయ్యా!

రవి; తాతగారూ!

( తెర పడుతుంది )

# జ్యోతి

ఆకాశవాణి;

విజయవాడ,

హైద్రాబాద్,

మద్రాసు,

కేంద్రాలలో

ప్రసరితం.

(14——10——59)

పాత్రలు :

– స్టేజీలో –

హేమలత ; నర్సు వేణు ; రోగి

గిరిధర్ ; డాక్టరు రఘు ; రోగి

– తెరలో –

వృద్ధుడు టీ. బి. పేషెంటు

పాప మెటర్నిటీవార్డులో స్త్రీ

[ యమ్. యమ్. ఏ. హాల్లో ఒక మూలగా తొమ్మిదీ పదీ నెంబర్ల బెడ్లు ఉన్నాయి. బెడ్లు తలవైపు గోడమీద నెంబర్లు ఉన్నాయి. స్టేజీ ఎడంవైపు డ్యూటీరూంకి పోయే త్రోవ. కుడీప్రక్క టి. బి. వార్డూ, మెటర్నిటీవార్డూ ఉన్నాయి. వార్డు కుడిప్రక్క, ప్రక్కకు తోవలేదు.

రెండు బెడ్ల మధ్య ఖాళీగా ఒక కుర్చీ, స్టూలూ ఉంటాయి. కుర్చీమీద డాక్టరు, స్టూలుమీద నర్సు కూర్చొని ఉంటారు. తొమ్మిది బెడ్డుమీద రఘు. పది బెడ్డుమీద వేణు పడుకొని ఉంటారు. తెర లేచింది.]

నర్సు; డాక్టర్.

డాక్ట; యస్ సిస్టర్ !

( టవర్ క్లాక్ పన్నెండు గంటలు కొట్టింది )

డాక్ట; చీకటి ఇంత దట్టంగా వుందేం సిస్టర్ !

నర్సు; ఇప్పుడే మరొక్క క్రొత్త రోజుకి మొదటి నిమిషం మొదలయింది డాక్టర్ !

డాక్ట; నల్లని మేఘాలు ఆకాశంలో క్రమ్ముకున్నాయి. వర్షం రావచ్చు.

నర్సు; ఈ రెండు కేసులూ సీరియస్ వే నంటారా !

డాక్ట; అనుమానమేమీ అక్కర్లేదు. సీరియస్ కేసు లే. ప్రమాదకరమైనవి కాకపోతే నాకు నైట్ డ్యూటీ పడదుగదా !

నర్సు; డాక్టర్ రెండూనా ?

డాక్ట; ఆఁ ! రెండూ...!

నర్సు; బ్రతికే విషయంలో......

డాక్ట; చెప్పలేం రెండూ క్రొత్త కేసులు. తెల్లవారుజాము ఐదు గంటలు దాటితే వాళ్ళిద్దరూ బ్రతికవచ్చు. డి. యమ్. ఓ. చెప్పాడు. ఈ రెండు కేసులూ విచిత్రంగా వున్నాయి సిస్టర్ ! టెంపరేచర్ నార్మల్ గా వున్నప్పుడు ఇద్దరూ మత్తుగా నిస్సత్తువగా పడుకుని వుంటారు.

నర్సు; అవును డాక్టర్ ! పగలు టెంపరేచర్ నార్మల్ గా వున్నప్పుడు కదలకుండా నిద్రపోతూ వుంటారట. డే డ్యూటీ నర్సు చెప్పింది.

డాక్ట; రఘుకి టెంపరేచర్ పడిపోతూ వుంటుంది. కొద్ది కొద్దిగా తగ్గటం మొదలు పెట్టిందగ్గర్నుంచి రఘుకి స్పృహ వస్తుంది. స్పృహ వచ్చేకొద్దీ తెలివిగా మాట్లాడుతూ వుంటాడు. టెంపరేచర్ నార్మల్

నుంచి ఇంతగా తగ్గి, తగ్గిపోయిన స్థితిలో ఇంతకాలం వుండి, బ్రతకటం చాలా కష్టం. కానీ, రఘు బ్రతికే వుంటున్నాడు.

నర్సు; డాక్టర్ ! అశుభం పలక్కండి !

డాక్ట; అశుభం పలకాలని కాదు. అతని కేసు విషయం మాత్రమే చెబుతున్నాను.

నర్సు; ఇతను క్లర్కు కదండీ !

డాక్ట; అవును. యస్. యస్. యల్. సీతో చదువు మానేసి ఐదు సంవత్సరాలనుంచి క్లర్కుగా ఉద్యోగం చేస్తున్నాడు.

నర్సు; వేణూ విషయం ఏమిటి డాక్టర్ !

డాక్ట; వేణుకి టెంపరేచర్ బాగా వస్తుంది. నార్మల్‌గా వున్నప్పుడు నిద్రపోతాడు. టెంపరేచర్ పెరుగుతున్న దగ్గర్నుంచి స్పృహ వస్తుంది. టెంపరేచర్ నూటైదు వచ్చేసరికి స్పృహ వస్తుంది. అక్కడ్నుంచి జ్వరం పెరుగుతున్న కొద్దీ తెలివిగా మాట్లాడుతాడు. నూట ఎనిమిది వచ్చి బ్రతికిన వాళ్ళు నాకు తెలియదు. నూటపదిదాకా వచ్చినా వేణు బ్రతికే వుంటున్నాడు.

నర్సు; చిత్రంగా వుందే !

డాక్ట; ఈ రెండు కేసులకీ ఏదో సామ్యం కనిపిస్తోంది.

నర్సు; ఏమిటండీ ?

డాక్ట; రెండు కేసులు శరీరం టెంపరేచర్‌కి సంబంధించినవి.

నర్సు; అవునూ !

డాక్ట; ఇద్దరి వయస్సూ దగ్గర దగ్గరగా ఒక్కటే !

నర్సు; ఆఁ!
డాక్టరు; ఇద్దరికీ పెళ్ళి కాలేదు.
నర్సు; ఊఁ ఉహూఁ!
డాక్టరు; రెండు కేసులకీ సంబంధం వుంది. ఇప్పటి స్థితి దాటితే రెంటికీ ప్రాణాపాయం వుంది.
నర్సు; తేడా కూడా వుంది డాక్టర్!
డాక్టరు; తేడా అల్లా రఘుకి టెంపరేచర్ నార్మల్‌నుంచి తగ్గుతుంది. వేణుకి నార్మల్‌నుంచి పెరుగుతుంది.
నర్సు; ఆఁ! అదే డాక్టర్!
డాక్టరు; టెంపరేచర్ నార్మల్‌గా వున్నప్పుడు ఇద్దరూ నిద్రపోతున్నారు మత్తుగా!
నర్సు; నాకిలాంటి కేసు లున్నాయని తెలియదండి!
డాక్టరు; నాకూ తెలియదు. ఇవి క్రొత్తగా వ్యాపిస్తున్నాయి. ఎలా ట్రీట్ చేయాలోకూడా తెలియటంలేదు. ఇది ఫలానా అని డి. యమ్. ఓ. కూడా కేసు డయాగ్నైజ్ చేయలేక పోయాడు. ఏవో మందులు వాడటం తప్ప సరైంది ఏమీ లేదు.
నర్సు; ఒంటిగంట కావస్తోంది.
డాక్టరు; ఊఁ!

(యమ్. యమ్. ఏ. వార్డుకు ప్రక్కగావున్న
టి. బీ. వార్డులో ముసలాడు
పెడబొబ్బలు పెడుతూ దగ్గాడు)

డాక్టరు; ఏమిటదీ?
నర్సు; బాధ – టీ. వార్డులోంచి.

డాక్ట: ఎవరో ?

నర్సు: ఎవరో ముసలాడు.

డాక్ట: ముసలాడికి కూడా ప్రాణంమీద తీపి.

నర్సు; పాపం. అవేం మాటలండీ ? బ్రతకటం కష్టమని డాక్టరు చెప్పారట. రెండులంగ్సూ పాడయిపోయాయిట.

వృద్ధు; (వార్డులో ఒక మూలనుంచి) అమ్మా ! నర్సమ్మతల్లీ! అమ్మా !

డాక్ట; ఎవరది.

నర్సు; మన వార్డులో జ్వరంలో వున్న ముసలాడు.

డాక్ట; ఎందుకు గోలచేస్తాడు ?

నర్సు; ఆ ముసలయ్యకు ఒకే ఒక్క కూతుర్ని ప్రసాదించి భార్య చనిపోయింది. కూతుర్ని పువ్వుల్లో పెంచాడు ముసలయ్య. ఆమె పెండ్లీడు కెదిగి అకస్మాత్తుగా చనిపోయింది. ఆమె మరణంతో ముసలయ్య మనస్సు స్థితి తప్పింది. వెర్రిగా ఏడుస్తాడు. శూన్యంలోకి చూస్తూ వుంటాడు. చనిపోయిన ముసలయ్య కూతురు పేరు నరసమ్మట. నన్ను నరసమ్మా అని పిలుస్తున్నాడు. కూతురా ? బంగారమా ! అంటాడు నేను దగ్గరగా వున్నప్పుడు, పాపం ముసలయ్య. నన్ను కన్న బిడ్డలాగా చూచుకొని తృప్తిపడుతూ వుంటాడు.

వృద్ధు; (వార్డులోంచి) అమ్మా! నరసమ్మతల్లీ!! అమ్మా!!!

డాక్ట; ఏమిటో ???

నర్సు; ఇంజక్షన్సు టైం దగ్గరకొస్తోంది.

డాక్ట; ఒంటిగంట కదూ !

నర్సు; ఇంజక్షన్ను తెస్తాను. (ప్యాంట్రీ రూంలోకి పోయుంది)
(తిరిగివచ్చి) ప్రతిరోజూ ఇంతేకదూ! డాక్టర్!

డాక్ట; అవును. ఒంటిగంట దగ్గర్నుంచి ఐదుగంటలుదాకా టెంపరేచర్ నార్మల్ స్థితిన్ని విడిచిపోతుంది. సడన్ సడన్గా ఛేంజి అవుతూ వుంటుంది. మూడురోజుల్నుంచీ ఇంతే. ఇవాళగాని ఐదు దాటితే రఘూ వేఃబా బ్రతుకుతాడు.

నర్సు; వాళ్ళదగ్గర ఇతరులెవ్వరూ వుండకూడదని డా. యఃప్. ఓ చెప్పాడు.

(వర్షం పడుతున్న సవ్వడి)

డాక్ట; తుంపర్లు పడుతున్నాయి.

నర్సు; అవునండి! —

డాక్ట; చలిగా వుంది.

నర్సు; అవునండి!..

డాక్ట; వర్షం బాగా కురుస్తోంది.

నర్సు; అవునండి!

డాక్ట; మీ ముఖం అంద్రంగా వుంటుందని సిస్టర్!

నర్సు; థాంక్స్ డాక్టర్!

డాక్ట; సరోజకంటే అందంగా వుంటావు.

నర్సు; సరోజ ఎవరూ?

డాక్ట; నా భార్య.

నర్సు; (మాట్లాడదు)

డాక్ట; నీకళ్ళు అందంగా వుంటాయి.

నర్సు; (మాటాడదు)
డాక్ట; నీలో ఏదో బలవత్తరమైన మహత్తర ఆకర్షణ వుంది.
నర్సు; (మాటాడదు)
డాక్ట; నీలో ఇవాళ కొత్తసొగసు కనిపిస్తోంది.
నర్సు; డాక్టర్ !
డాక్ట; యస్ !
నర్సు; మీరు మాట్లాడవద్దు.
డాక్ట; వర్షం పడుతోందికదూ !
నర్సు; అవునండి.
డాక్ట; చలిగా లేదూ !
నర్సు; ఉంది - లేదు డాక్టర్ !
డాక్ట; ఇక్కడ కూర్చుందువుగాని ఇలా రా సిస్టర్ !
నర్సు; షటప్ !

(మేఘం ఉరిమింది. వర్షం హోరు తగ్గింది)

డాక్ట; సారీ సిస్టర్ !
నర్సు; థాంక్స్ డాక్టర్ !

( మెటర్నిటీ వార్డులోంచి స్త్రీ అరుపులు )

డాక్ట; ఎవరది !
నర్సు; ఎవరో స్త్రీ !
డాక్ట; ఏమిటా అరుపులు !
నర్సు; మెటర్నిటీ వార్డులోంచి.

( వార్డులో మరొక మూలనుంచి )

పాప; అమ్మా ! అమ్మా ! !
డాక్ట; ఎవరది ?

నర్సు; పసివాడు.

డాక్టు; ఎందుకు కలవరిస్తాడు.

నర్సు; ఆపాప పుట్టకముందే వాళ్ళ నాన్న చనిపోయాడు. పాప నాలుగు సంవత్సరాల అమ్మ చనిపోయింది. బీద వాడు చుట్టూ ఎవరూ చూచే చుట్టాలు లేనివాడు. ఎవరో ధర్మాత్ములు జ్వరంతో వున్నవాడిని హాస్పిటల్లో చేర్చారు. చేర్చింది మొదలు నన్ను అమ్మా, అమ్మా అంటూ వెంట తిరగటం మొదలు పెడుతున్నాడు. దగ్గర కూర్చోబెట్టుకుంటాడు. నా కళ్ళల్లోకి చూస్తూ కన్నీళ్లు పెట్టుకుంటాడు. 'అమ్మా' అంటూ వళ్ళో వాలిపోతూ బావురుమని ఏడుస్తాడు.

పాప; అమ్మా! అమ్మా!!

డాక్టు; ఇంజక్షన్సు ప్రిపేరు చేశావుకదూ!

నర్సు; ఆఁ!

డాక్టు; ఈ నాలుగ్గంటలూ మనం జాగ్రత్తగా ఉంటే ఇద్దరు బ్రతుకుతారు.

నర్సు; (వత్తుతూ) జాగ్రత్తగా ఉంటే.

డాక్టు; జాగ్రత్తగానే ఉందాం.

నర్సు; అలాగే డాక్టర్! ఐదుగంటలు దాటితే వాళ్ళు బ్రతుకుతారు కదూ!

డాక్టు; తప్పకుండా బ్రతుకుతారు. రోజులాగానే ఐదుగంటల తర్వాత వాళ్ళిద్దరికీ టెంపరేచర్ నార్మల్‌గా వస్తుంది. టెంపరేచర్ నార్మల్‌గా ఉన్నప్పుడు స్పృహ లేకుండా పడిపోవటం మామూలు. ఇవాళకూడా అలాగే

అయితే కొద్దిరోజుల్లో వాళ్ళకి మరణం ఉంటుంది.
అలాకాక ఐదుగంటల తర్వాత టెంపరేచర్ నార్మ
ల్‌గా ఉన్నప్పుడు స్పృహ ఉండి, స్థిరమైన స్థితిలో
మాట్లాడితే బతుకుతారు.

నర్సు; ఏమో డాక్టర్! ఎలా వుంటుందో!

డాక్టర్; ప్రయత్నిద్దాం!

నర్సు; పిచ్చి పిచ్చి ఉద్రేకాలు, జీవితాలు, క్షణికాలు.

డాక్టర్; ఇంజక్షన్ను తీసుకో.

నర్సు; అవును.

(గోడ గడియారం ఒంటిగంట కొట్టింది.)

డాక్టర్; సిస్టర్ టెంపరేచర్ చూడు. రెండు థర్మామీటర్లు తెచ్చావుగా.

నర్సు; (చూచి) నార్మల్‌గా ఉన్నట్లుంది!

డాక్టర్; నువ్విక్కడే ఉండు. వాళ్ళు ఏమాత్రం కదిలినా టెంపరేచర్ చూడు! నన్ను పిలువు. డ్యూటీ రూములో ఉంటాను.

నర్సు; సరేనండి.

డాక్టర్: (వెళ్ళిపోయాడు.)

రఘు; అమ్మా!

నర్సు; ఏమండీ (కుర్చీలోంచి లేచింది) (టెంపరేచర్ చూచి) డాక్టర్! బెడ్ నైన్ పేషెంట్స్ ఫోర్ డిగ్రీలు పడిపోయింది టెంపరేచర్!

డాక్టర్; (తొందరలో) ఈజిట్ (వచ్చాడు)

రఘు; డాక్టర్!

డాక్టర్; పెద్దగా అరవకు మిష్టర్—సిస్టర్ ఇంజక్షన్.
నర్సు; ఇవిగో.
డాక్టర్; చేయి - ఆఁ! (ఇంజక్షను చేశాడు)
రఘు; (బాధగా మూలుగు)
డాక్టర్; ఫరవాలేదు. మరొక్క గంటదాకా మరేం భయం
లేదు.
నర్సు; అంటే రెండు గంటలదాకా......
డాక్టర్; పదో నెంబరు బెడ్డు - వేణుకి నార్మల్‌గా ఉందిగా
నర్సు; అవునండి!
డాక్టర్; డ్యూటీ రూంలో ఉంటాను. (వెళ్ళాడు)
రఘు; మీ రిక్కడ నర్సా?
నర్సు; అవునండి!
రఘు; మీరు అందంగా ఉన్నారు.
నర్సు; నిజమేనాండి?
రఘు; చాలా అందంగా ఉన్నావ్! నిన్ను చూడాలని ఆనం
దంగా ఉంది.
నర్సు; సరే చూడండి. చూస్తూ పడుకోండి.
రఘు; మీ రిక్కడే ఉండండి.
నర్సు; అల్లాగే.
రఘు; మీ పేరు?
నర్సు; పేరెందుకు?
రఘు; పిలవటానికి.
నర్సు; సిస్టర్ అని పిలవ్వచ్చుగా...
రఘు; నేను అలా పిలవను!

నర్సు; ఏం? ఎందుకనీ?
రఘు; ఏమో! ఎందుకో నాకు తెలియదు!!
నర్సు; హేమలత.
రఘు; బాగుంది. చాలా బాగుంది. హేమా అని పిలుస్తాను.
నర్సు; మీ ఇష్టం.
రఘు; హేమా.
నర్సు; ఏమండీ!
రఘు; ఏమండీ ఏమిటి హేమా?
నర్సు; టెంపరేచర్ చూడనివ్వండి!
రఘు; ఎంతవుంది?
నర్సు; పాయింట్ టూ డిగ్రీలు పడిపోయింది.
రఘు; ఇంతకు ముందెంత జ్వరం వుంది.
నర్సు; ఇంతకుముందు జ్వరం...ఇంతకుముందు కొంచెంజ్వరం వుందిలెండి!
రఘు; ఎంతవుంది?
నర్సు; సరేగాని మిమ్మల్ని ఏమని పిలవమంటారు?
రఘు; మీ ఇష్టం. నాపేరు రఘు.
నర్సు; ఏమండీ అని పిలుస్తాను.
రఘు; సరే. నేనుమాత్రం ...
నర్సు; హేమా అని పిలుస్తానంటారు.
రఘు; అవును.
నర్సు; అలాగ్గేలెండి.
రఘు; దుప్పటి కప్పు హేమా.
నర్సు; ఊఁ!

రఘు; హాయిగా వుంది హేమా — నిద్రవస్తోంది.
నర్సు; హాయిగా నిద్రపోండి!
వేణు; అమ్మా.
నర్సు; డాక్టర్! బెడ్ టెన్. వేణు కదిలాడు.
డాక్ట; (తెరలో) వస్తున్నా (వచ్చాడు)
రఘు; అమ్మా (స్పృహ తప్పింది)
డాక్ట; రఘు కెలావుంది!
నర్సు; టెంపరేచర్ నార్మల్‌కి వచ్చింది.
డాక్ట; అతనితో టెంపరేచర్ పడిపోతోందని చెప్పలేదుకదూ!
నర్సు; చెప్పలేదు. టెంపరేచర్ వస్తోందని చెప్పాను.
డాక్ట; మంచిపని చేశావు!
వేణు; అమ్మా!
డాక్ట; వేణూ టెంపరేచర్ ఎంత?
నర్సు; నూటయిదు.
వేణు; టెంపరేచర్ ఎంతా?
నర్సు; నూట ఒకటి.
వేణు; నూట ఒకటి వుండదు. జాగ్రత్తగా చూడండి. తగ్గింది.
నాకొంచెం హాయిగావుంది.
డాక్ట; (ఇంజెక్షను జేశాడు) రెండుగంటలుదాకా ఫరవాలేదు.
వస్తాను. డ్యూటీరూంలో ఉంటాను.
వేణు; ఇంతకుముందు వర్షం కురిసినట్లుంది.
నర్సు; అవును.
వేణు; నాకిప్పుడు జ్వరం తగ్గుతున్నట్లేకదూ!
నర్సు; అవును.

వేణు; నాకు బాగా జ్వరం వచ్చినప్పుడు నిద్రపోతున్నాను కదూ!

నర్సు; అవును.

వేణు; జ్వరం తగ్గినప్పుడు మెలకువ వస్తోంది కదూ!

నర్సు; అవును.

(ఈదురుగాలి తోలిన ధ్వని)

వేణు; మీ ముఖంలో జీవకళ ఉంది!

నర్సు; మరీ......సర్!

వేణు; మీ కన్నుల కోనల్లో వెలుగు రేఖ లున్నాయి.

నర్సు; బావుంది.

వేణు; మీ మూర్తిలో పరమార్థ స్ఫూర్తి వుంది.

నర్సు; ఎవరన్నారు?

వేణు; నేనే అంటున్నా!

నర్సు; మీ రెవరు అనటానికి?

వేణు; ఆమాత్రం తెలియదూ వేణ్ణి.

నర్సు; సరేగాని కొంచెంసేపు మాటాడకుండ పడుకొని నిద్ర పొండి.

వేణు; డే డ్యూటీ చేసిన నర్సుకంటే మీరు అందంగా ఉన్నారు.

నర్సు; ఆహా! సరేలెండి ఆవిడ వింటే ఏమనుకుంటుంది.

వేణు; ఏమీ అనుకోదు.

నర్సు; తప్పు కదూ!

వేణు; ఫరవాలేదు...మీ పేరు.

నర్సు; ఎందుకు?

వేణు; తెలుసుకుందామని.

నన్స; హేమలత.

వేణు; లత. బావుంది. చక్కని పేరు. చాలా చక్కని పేరు. చాలా బావుంది.

నన్స; వస్తామరి...

వేణు; ఎక్కడికి లతా?

నన్స; డ్యూటీరూంకి మిష్టర్!

వేణు; మీరిక్కడే వుండకూడదూ.

నన్స; ఎందుకు?

వేణు; అవసరం ...

నన్స: సరే! అలాగ్గే!

వేణు; లతా

నన్స; వాట్ మిష్టర్.

వేణు; మిష్టర్ అనకుండా అప్యాయంగా వేణూ అనకూడదూ.

నన్స; ఎందుకనీ అలా పిలవటం.

వేణు; అలాపిలిస్తే హాయిగా...జ్వరం వస్తోంది లతా! — అమ్మా! (స్పృహ తప్పింది)

నన్స; డాక్టర్!

డాక్ట; (తెరలో) యస్. సిస్టర్! టెంపరేచర్ నార్మల్‌కు వచ్చిందా?

నన్స; అవును.

డాక్ట; స్పృహ తప్పినట్లుంది.

నన్స; అవును డాక్టర్!

(6)

రఘు; అమ్మా!

డాక్టర్; రఘుకి స్పృహవచ్చినా భయంలేదు రెండుగంటలుదాకా.

రఘు; హేమా!

నర్సు; ఏమండీ!

రఘు; నాకొక కలవచ్చింది.

నర్సు; కలా?!

రఘు; అవును.

నర్సు; ఏమిటండీ అదీ ?

రఘు; కూర్చో హేమా చెబుతాను.

నర్సు; (కుర్చీ లాగుకొని ఎదురుగా కూర్చుని) చెప్పండి.

రఘు; నేనొక అప్లికేషన్ పూర్తిచేశాను.

నర్సు; ఏ అప్లికేషనూ ?

రఘు; ఏదో ఉద్యోగానికి ఇంతకంటే పెద్ద ఉద్యోగం జీతం ఎక్కువ వస్తుంది. జీవితం విలువ పెరుగుతుంది. హోదా కలుగుతుంది. అందుకని మొదటి ఉద్యోగానికి రాజీనామా పడేసి కొత్త ఉద్యోగానికి దరఖాస్తు దాఖలా చేసుకున్నాను. ఉద్యోగం వచ్చింది. చేరబోతున్నాను.

నర్సు; మరి ?

రఘు; ఉద్యోగంలో చేరబోయేటప్పుడు నువ్వు కనిపించావు — కలలో—

నర్సు: నేనా ?

రఘు; నువ్వే! సరిగ్గా నువ్వే!!

నర్సు; ఏమయింది ?

రఘు; నీతో మాట్లాడబోయాను. కల కరిగిపోయింది. మెల
    కువ వచ్చింది. ఎదురుగా నువ్వున్నావు.
నన్ను; సరే లెండి! కదలకుండ పడుకోండి!
వృద్ధు; (తెరలో) అమ్మా! నరసమ్మ తల్లీ!! అమ్మా!!!
నన్ను; వస్తున్నా! ఆగయ్యా!!
    ( టీ. బీ వార్డులో పేషెంటు దగ్గు )
రఘు; ఆ దగ్గుతున్న ముసలివాడు టి. బీ వార్డులో వున్నాడా?
నన్ను; అవును!
రఘు; శ్రమపడి నన్ను చదివించిన నాన్న నాకు ఉద్యోగం
    వచ్చిన మొదటి రోజునే టీ. బీ. తో మరణించాడు.
నన్ను; మీ కెవరూ లేరా?
రఘు; లేరు.
నన్ను; పెళ్ళెందుకు చేసుకోలేదు.
రఘు; ప్రేమించిన పెన్నిధి పేదవాణ్నని తెలిసి పెళ్లి చేసుకోను
    పొమ్మంది.
నన్ను; పాపం.
రఘు; హేమా!
నన్ను; ఏమండీ!
రఘు; నేను బ్రతుకుతాను కదూ!
నన్ను; భయపడకండి!
రఘు; జ్వరం వస్తోంది హేమా!
నన్ను; జ్వరమా?
రఘు; అవును!
నన్ను; చూడనివ్వండి!

రఘు; అమ్మో! (స్పృహ తప్పింది.)
నర్సు; డాక్టర్ రఘుకి నార్మల్ టెంపరేచర్ అయింది.
రఘు; (తెరలో) ఫరవా లేదు.
వేణు; అమ్మో!
నర్సు; డాక్టర్!
డా; వాట్ సిస్టర్!
నర్సు; వేణుకి స్పృహవస్తోంది.
డాక్ట; నూటాఱు మించితే పిలువు టెంపరేచర్ చూడు!
నర్సు; అల్లాగ్గేనండి!
వేణు; లతా! నాకు కల వచ్చింది.
నర్సు; కలా!
వేణు; అవును. నేను చనిపోయాను.
నర్సు; మిష్టర్. అవేం మాటలు?
వేణు; కలలోకదా! చెప్పనిద్దూ!
నర్సు; అయితేమాత్రం...చెప్పండి!
వేణు; నాకు శరీరం లేదు ఆత్మ ఎక్కడికో పోయింది.
నర్సు; (వత్తుతూ) ఆత్మ!
వేణు; అది ఉద్యాన వనమో అరణ్యమో అర్థం కాకుండా వుంది!
నర్సు; ఆఁ!
వేణు; అక్కడెవరో ఉన్నారు. దేవతాధిపతో, రాక్షసాధిపతో తెలియలేదు.
నర్సు; ఏమిటండీ ఇదీ?
వేణు; వినుమరి?

నర్సు; ఊఁ!

వేణు; అతనివైపు చూశాను భయంకరంగా ఉన్నాడు. ఈ స్థలం పేరేమిటన్నాను. 'నరకం' అన్నాడు.

నర్సు; నరకమా!

వేణు; నాకూ భయంవేసింది. మరొకసారి అతనివైపు చూశాను. సౌమ్యంగా ఉన్నాడు. ఈ స్థలం పేరేమిటన్నారూ అన్నాను స్వర్గం అన్నాడు.

నర్సు; స్వర్గమా!

వేణు; నాకూ సంతోషం కలిగింది. ముందుకు నడుస్తున్నాను. ఇంతలో ఎవరో ఎదురుగా వచ్చారు. మామూలుగానే వున్నాడు.

నర్సు; (చిరాగ్గా) ఏమిటిది?

వేణు; (మామూలుగా) ఏమిటది స్వర్గమా? నరకమా? అని అడిగాను.

నర్సు; ఏమిటీ గొడవ?

వేణు; నేను దిక్కులు చూస్తూ నిలబడ్డాను. అంతలో నువ్వు కనిపించావు.

నర్సు; నేనా?

వేణు; అవును. నువ్వే.

నర్సు; నేనే!

వేణు; సరీగ్గా ఇదే డ్రస్సులో!

నర్సు; అయితే!

వేణు; చాలా వేగంగా నేను నీదగ్గరకు పరుగెత్తుకొస్తున్నాను.

నర్సు; ఊఁ! అయితే........

వేణు; కాలు జారింది పడిపోయాను.

నన్సు; అయ్యో!

వేణు; నువ్వు నన్ను లేపటానికి వస్తున్నావు. నాకు మెలకువ వచ్చింది.

నన్సు; సరేగాని మిస్టర్!

వేణు; ఏమిటి లతా!

పాప; (తెరలో) అమ్మా! అమ్మా!!

నన్సు; వస్తున్నా! ఆగు బాబు!!

( మెటర్నిటీ వార్డులోంచి స్త్రీ అరుపులు )

వేణు; నేను పుట్టింది మొదలు నన్ను పువ్వులాగా అమ్మ కాపాడుతూ వచ్చింది.

నన్సు; మీ అమ్మా, నాన్నా, వున్నారా?

వేణు; లేకేం? వున్నారు.

నన్సు; నాన్న ఏం చేస్తారూ?

వేణు: ఏమీ చేయరు, పొలం పనులు చేయిస్తూ వుంటారు.

నన్సు: మీరెంతమందీ సంతానం?

వేణు: నేనొక్కడ్నే! - నేను చనిపోతాను కదూ!

నన్సు: భయపడకు మిస్టర్!

— క్షణకాలం స్టేజీమీద చీకటి —

వెంటనే — వెలుతురు —

(టవర్ క్లాక్ నాలుగు గంటలు కొట్టింది)

నన్సు: డాక్టర్! మీరు రండి! వేణూ టెంపరేచర్ నూట తొమ్మిదీ పాయింట్ ఎనిమిదీ, రఘు టెంపరేచర్ తొంభై అయిదూ పాయింట్ రెండు.

డాక్ట: (తెరలో) వస్తున్నా! (వచ్చి) మనం ఇప్పుడు క్రొత్తగా వాడే మందు లేమీ లేవు.

వేణు: లతా !

నర్సు: వాట్ మిస్టర్ !

రఘు: హేమా !

నర్సు: ఏమండీ !

డాక్ట: సిస్టర్ !

నర్సు: యస్ డాక్టర్ !

డాక్ట: వాళ్లు నిన్ను పేరుతో పిలుస్తున్నారెందుకు ?

నర్సు: పిలుస్తున్నారు.

డాక్ట: పిలుస్తున్నా రనేది నాకు తెలుసు. ఎందుక నేది ప్రశ్న. నీ జవాబు ఏమిటి ? ఎందుకు సహిస్తున్నావ్ !

నర్సు: డాక్టర్ ! వాళ్లు బ్రతుకుతారో చనిపోతారో ఎవరికీ తెలియదు, దేవుడికి తప్ప. నాకు తెలిసింది అల్లా బాధలో ఉన్న వాళ్ళను మరే రకంగానూ బాధ పెట్ట కూడదని. వాళ్ళు పేరుతో పిలుస్తా మన్నప్పుడు వద్దనటం బాధ పెట్టటమే అవుతుంది. వాళ్ళు పేరుతో పిలచినంత మాత్రాన నాకు నష్టమేమీ లేదు. అలా పిలవనిచ్చినందువల్ల ఏమైనా మేలు కలిగితే అదే పదివేలు !

(మసీదులోంచి నమాజు సంబంధమైన మధురధ్వని)

రఘు: హేమా !

నర్సు: ఏమండీ !

రఘు: జ్వరం తగ్గిందికదూ !

నన్స్: అవును తగ్గింది.

రఘు: నేను బ్రతుకుతాను.

నన్స్: తప్పకుండ బ్రతుకుతారు.

(చర్చి గంటల మధుర రవళి)

వేణు: లతా!

నన్స్: వాట్ మిస్టర్.

వేణు: నాకు జ్వరం తగ్గటంలేదుకదూ!

నన్స్: లేదు. తగ్గుతోంది.

వేణు: నేను చనిపోతాను కదూ!

నన్స్: లేదు. మీరు బ్రతుకుతారు.

(గుడిగంటలు మ్రోతలు)

డాక్టర్: (సిగరెట్టు వెలిగించుకున్నాడు)

వేణు: వెలిగి, ఆరిపోయిన అగ్గిపుల్లా, మండి, కాలుతున్న సిగరెట్టూ, వీటి విలువ, ఎంత? – కాసు ఖరీదు చేయని నుసి!

రఘు: నల్లబడ్డ అగ్గిపుల్లా, ఎర్రపడ్డ సిగరెట్టూ ఉత్తేజమివ్వటానికి ఉపయోగపడ్డాయి. వీటిని తయారుచేయటానికి జరిగిన పరిశ్రమలో పడిన కష్టం ఖరీదెంత? – విలువ నిర్ణయించలేని చెమట!

వేణు: ఆకాశమూ, భూమీ అప్పడాలు లాగా అతుక్కుపోతే సముద్రా లేవవుతాయి – పాకం.

రఘు: షడ్రసాల సృష్టి సముద్రంలో కలసిపోతే వచ్చే ప్రసాదం – పానకం.

వేణు: రసాతలం రసమయం కాదు. ఆకాశం ఎత్తులో లేదు. సముద్రం లోతుకాదు. శూన్యం గంభీరం కాదు. గంభీరం శూన్యం కాదు.

రఘు: సముద్రముంటే వర్షం కురుస్తుంది. వర్షం కురవక పోయినా సముద్రముంటుంది.

వేణు: వర్షం కురిస్తే పంటలు పండుతాయి. పంటలు పండక పోయినా వర్షం కురుస్తుంది. వర్షం పడకపోతే పంటలు పండవు. పంటలు పండకపోతే వర్షం ఆగిపోతుందా ?– లేదు. వట్టిది. బూటకం.

రఘు: ఆత్మకూ పరమాత్మకూ మధ్య అవాంతరాలు లేవు. దేవుడూ మానవుడూ ఒకటికాదు.

వేణు: స్వర్గంలో నరకం స్త్రీ. నరకంలో స్వర్గం స్త్రీ విషయమైన తలపుల కన్నీటిపాట రొదలో.

బాధ – అమ్మా! (స్పృహతప్పింది)

(తెరలో)

వృద్ధు: అమ్మా! నరసమ్మతల్లీ! అమ్మా!

నర్సు: వస్తున్నా! ఆగయ్యా!

(టి. బీ. వార్డులో ముసలాడు దగ్గి దగ్గి పూర్తి నిశ్చబ్దంగా వూరుకున్నాడు.)

డాక్ట: టీ. బీ. ముసలాడు చనిపోయినట్లున్నాడు.

నర్సు; అవును. పాపం.

రఘు: (పెద్దగా) అమ్మా! (గావుకేక)

డాక్ట: సిస్టర్! సిస్టర్! రఘు టెంపరేచర్ చూడు.

నర్సు: (చూచి విచారంగా) రఘు చనిపోయాడు డాక్టర్!
డాక్ట: చనిపోయాడు. పోనీలే! బాధపడకు.
నర్సు: (బాధగా) లేదు. లేదు డాక్టర్!
వేణు: అమ్మా!
డాక్ట: సిస్టర్! సిస్టర్!! వేణుకి మెలకువ వచ్చింది.
నర్సు: అవును డాక్టర్! అవును - ఇప్పుడేం చేయాలి డాక్టర్!!
డాక్ట: ఇతనుకూడా బ్రతకడేమో సిస్టర్.
నర్సు: (బాధగా) ఏమో! ఏమిటి డాక్టర్ ఏమి చేయాలి.
డాక్ట: జీవితాలు చిత్రంగా నడుస్తుంటాయి సిస్టర్!
వేణు: లతా!
నర్సు: ఏమండీ!
వేణు: లతా!
నర్సు: ఏమండీ!
వేణు: నేను చనిపోతాను కదూ!
నర్సు: బ్రతుకుతారు ... మీరు బ్రతుకుతారండీ!
వేణు: లతా!
నర్సు: ఏమండీ!
వేణు: లతా!!
నర్సు: ఏమండి వేణూ!!
వేణు: లతా!!!
నర్సు: వేణూ!!! (ఆప్యాయంగా)
వేణు: (ఆశ్చర్యంగా) లతా! లతా!! వేణూ అని పిలిచావు కదూ — చాలు లతా! చాలు!
నర్సు: హృదయపూర్వకంగా పిలిచాను వేణూ.

వేణు: నేను బ్రతుకుతాను. నేను బ్రతికాలి.
డాక్టర్: సిస్టర్!
నర్సు: యస్ డాక్టర్!
డాక్టర్: హృదయపూర్వకంగా పిలిచావా?
నర్సు: అవును డాక్టర్!
డాక్టర్: (కోపంగా) సిస్టర్!
నర్సు: (జాలిగా) డాక్టర్!
వేణు: అమ్మా! (స్పృహ తప్పింది)
నర్సు: టెంపరేచర్ పడిపోయింది డాక్టర్!
డాక్టర్: లెట్ ఇట్ బి
నర్సు: డాక్టర్! ఏమిటా మాటలు?
డాక్టర్: ఏమీ లేవు.
నర్సు: ఏమిటి డాక్టర్ ఆ నిర్లక్ష్యం?
డాక్టర్: నిర్లక్ష్యం. పాపం హృదయ పూర్వకంగా పిలిచావుగా!
నర్సు: లేదు డాక్టర్! అలా పిలిచినప్పుడు అతను విని సంతోషింపగలడనీ, బాధపడడనీ, బతుకుతాడనీను, డాక్టర్!
డాక్టర్: దగ్గరకు రమ్మంటే మేఘంలా గర్జించావ్! నేను బాధపడటం మాత్రం సహింపగలవ్! ఎవడో అనామకుడ్ని మాత్రం బాధపడనివ్వనంటావ్!
నర్సు: మీరు ఇలా ఎందుకయిపోయారు డాక్టర్! పేషెంటు ఏమైపోతాడో.
డాక్టర్: (నిర్లిప్తంగా) చనిపోతాడు.
నర్సు: డాక్టర్!

డాక్ట: చనిపోతాడు — ఖాయం. హృదయపూర్వకంగా పిలిచావు - వ్యర్థం.

నర్సు: హృదయపూర్వకంగా అనేది మాటమాత్రమే. అదైనా పేషెంటు మేలుకోరి మాత్రమే డాక్టర్ !

డాక్ట: అయినా ప్రయోజనం లేదు.

నర్సు: ప్రయోజనమేమిటి డాక్టర్ !

డాక్ట: వాడు చస్తాడు.

నర్సు: మీరు మనుష్యులేనా? మీకు హృదయముందా? డాక్టర్ !

డాక్ట: నూటికి నూరుపాళ్ళు నిజం. నిక్కచ్చిగా చచ్చి వూరుకుంటాడు.

నర్సు: మీరు అన్నంతమాత్రాన చనిపోడు.

డాక్ట: నేను డాక్టర్ని. వాడికి చావు తప్పదు.

నర్సు: నేను నర్సుని అతనికి మరణం రాకుండా జరిగేట్టు... దేవుడు మేలుచేస్తాడు......ప్రయత్నిస్తాను.

డాక్ట: చనిపోయి తీరతాడు.

నర్సు: చనిపోవటానికే వీల్లేదు.

డాక్ట: నువ్వు సావిత్రివి కాదు.

నర్సు: నువ్వు మాత్రం యముడివి.

డాక్ట: మరణాన్ని నువ్వు ఆపలేవు.

నర్సు: దేవుడున్నాడు. ఆపుతాను.

వేణు: అమ్మా (స్పృహ వచ్చింది)

డాక్ట: టెంపరేచర్ చూడు !

నర్సు: అనవసరం. టెంపరేచర్ ఏ స్థితిలో వున్నప్పుడు అతను స్పృహలో వుంటాడో చాలా సేపటిన్నించి మనకి తెలుసు. అయినా మందులు వాడితే మనిషి బ్రతికే స్థితి దాటిపోయిందని రఘు మరణంతో తేలిపోయింది. అంతకంటె ఉన్నతమైన ట్రీట్‌మెంటు మరేదో జరగాలి.

డాక్టర్: వాట్ ఈజ్ దట్. టెంపరేచర్ చూడమంటుంటే! (థర్మామీటర్ ఇవ్వబోయాడు)

నర్సు: అక్కర్లేదు (కోపంగా కొట్టింది. థర్మామీటరు క్రింద పడింది)

డాక్టర్: టెంపరేచర్ నేను చూస్తాను.

నర్సు: అది నా పని.

డాక్టర్: ఇంజక్షన్ను చేస్తాను.

నర్సు: ఎక్కువ మాట్లాడకండి. అతనికి మీ మందులేమీ అక్కర్లేదు.

డాక్టర్: సిస్టర్! ఏమిటీ తలబిరుసుతనం?

నర్సు: ఎవరికి? – ఏం మిస్టర్ గిరిధర్ డి. యం. ఒ. కి రిపోర్టు చేయాలా?

డాక్టర్: (నిరుత్తరుడైపోయి కుర్చీలో కూర్చుంటాడు)

వేణు: లతా!

నర్సు: (ఆప్యాయంగా) ఏం వేణూ!

వేణు: లతా! టెంపరేచర్ లేదుకదూ.

నర్సు అవును వేణూ

వేణు: నేను బ్రతుకుతాను లతా ...

నర్సు: తప్పకుండా బ్రతుకుతావు వేణు. నువ్వు నాకోసం బ్రతుకుతావు.

వేణు: నేనదృష్టవంతుణ్ని. నా లతకోసం నేను బ్రతుకుతాను. దేవుడు మంచివాడు.

నర్సు: నేను ధన్యురాల్ని వేణూ!

వేణు: నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా లతా...

నర్సు: అవును వేణూ...

డాక్టర్: సిస్టర్!

నర్సు; షటప్

వేణు; నన్ను పెళ్ళి చేసుకోగలవా లతా?

నర్సు; నాకంత భాగ్యమా వేణూ...

వేణు; నువ్వు లేందే నేను బ్రతుకలేను... అను లతా పెళ్ళి చేసుకుంటానను వినాలని వుంది. అను లతా!

నర్సు; వేణూ! నిన్ను నేను తప్పకుండా పెళ్ళిచేసుకుంటాను.

డాక్టర్: సిస్టర్!

నర్సు: డోన్ట్టాక్.

వేణు: అమ్మా! (స్పృహ తప్పింది)

డాక్టర్: అతన్ని పెళ్ళి చేసుకుంటావా?

నర్సు: అవును!

డాక్టర్: నిజంగానా?

నర్సు: నిజంగానే! సరేనా?

డాక్టర్: అయిదు అయిపోయింది.

నర్సు: అంటే!

డాక్ట: రెండూ మూడు రోజుల్లోనైనా వాడు చనిపోవటం ఖాయం.
నర్సు: చనిపోడు.
డాక్ట: టైం చేయిదాటి పోయింది.
నర్సు: గోడ గడియారం నిదానంగా చూడండి.
డాక్ట: ఏమిటి ?
నర్సు: ఎంతయింది ? ఇంకా అయిదు కాలేదు.
డాక్ట: అది ఆలస్యంగా తిరుగుతోంది.
నర్సు: అదికాదు. తమరి బుఱ్ఱ !
డాక్ట: (కోపంగా) సిస్టర్ !
నర్సు: తగ్గండి డాక్టర్!
వేణు; అమ్మా (స్పృహవచ్చింది)
నర్సు; వేణూ మన మేరేజి ఎప్పుడూ ?
వేణు; ఈ వేసవిలోనే. వచ్చే నెల్లో నాకు పరీక్షలు అయిపోతాయి.
నర్సు; చదువు అయింతరవాత ఏం చేస్తారూ ?
వేణు; పెద్ద ఆలోచనే వుంది.
నర్సు: ఉద్యోగమా...?
వేణు: అబ్బే అప్పుడే మనకేం ఉద్యోగం.
నర్సు: మరీ...
వేణు: ఐ. ఏ. యస్‌కి అప్పియర్ కావాలి.
నర్సు: ఆ తరవాత...
వేణు: కలెక్టరు...
డాక్ట: పూర్ ఫెలో.

వేణు: అమ్మా (స్పృహ తప్పింది)

నర్సు: ఒక్కొక్కరికి జీవితంమీద ఎన్నెన్ని ఆశలో...

డాక్టర్: ఐ. ఏ. యస్ ఆఫీసర్ను పెళ్ళి చేసుకుందామనీ.

నర్సు: ఛీఛీ !

డాక్టర్: పాపం ! చాలా శ్రమపడుతున్నావ్. అనవసరం. వాడు చస్తాడు.

నర్సు: శుద్ధ పొరపాటు.

డాక్టర్: రఘుకీ వేణుకీ వచ్చిన జబ్బులు టెంపరేచర్ కి సంబంధించినవి.

నర్సు: అవును.

డాక్టర్: ఇద్దరూ యువకులు......పెళ్ళికానివాళ్ళు.

నర్సు; కావచ్చు.

డాక్టర్; ఇద్దరి వయస్సూ ఒకటే.

నర్సు; అయితే !

డాక్టర్; ఇద్దరూ హాస్పటల్లో చేరింది ఒకే రోజు.

నర్సు; కాదని ఎవరూ అనరు.

డాక్టర్: ఇద్దరికీ బాస్ నిర్ణయించింది ఒకటే టైం.

నర్సు: గొప్ప విషయం.

డాక్టర్: రఘు చనిపోయాడు.

నర్సు: వేణు చనిపోడు,

డాక్టర్: చచ్చి వూరుకుంటాడు.

నర్సు: వీల్లేదు డాక్టర్. ఒక్క విషయం గుర్తుంచుకోండి. రఘుకి టెంపరేచర్ నార్మల్ పడిపోతుంది. వేణుకి

నార్మల్‌నుంచి పెరుగుతోంది. ఈ ఒక్క తేడా చాలు వేణు బ్రతికటానికి. వేణు బ్రతుకుతాడు.

డాక్టర్: పెళ్ళి చేసుకుంటాడని ఎంత ఆశా ?

నర్సు: రాక్షసత్వం.

వేణు: అమ్మా ! (స్పృహ వచ్చింది)

నర్సు: వేణూ......

వేణు: ఇటురా లతా !

నర్సు: ఏమిటి వేణూ !

వేణు ఇక్కడ కూర్చో......

నర్సు: బెడ్డుమీదా......?

వేణు: ఆఁ! అవును !

నర్సు: వద్దు ! బావుండదు !

వేణు: కూర్చో మంటుంటే.

నర్సు: వద్దు వేణు ... నా మాట విను.

డాక్టర్: సిగ్గూ ఎగ్గూ లేకపోతే సరి !

నర్సు: ఉంటే – నోరు మూసుకుంటే మంచిది.

వేణు: కూర్చోలతా !

నర్సు: అల్లాగే వేణూ ! (కూర్చుంది)

వేణు: థాంక్స్ లతా !

డాక్టర్: (కోపంగా) సిస్టర్ !

నర్సు: (తేలిగ్గా) సారీమిస్టర్ గిరిధర్ !

డాక్టర్: అసభ్య ప్రవర్తన.

నర్సు: కావాలంటే పోయి రిపోర్టు తయారుచేసుకోండి.

వేణు: లతా నువ్వెంత అందంగా వున్నావ్ !

నర్సు: నువ్వు అనుకోవటంలో వుంది వేణూ.

వేణు: ఏమో లతా ప్రపంచంలో నేనింతవరకు ఇంత అం
దాన్ని చూడలేదు.

నర్సు: మీరు భ్రమిస్తున్నారేమో వేణూ !

వేణు: లేదు లతా ! లేదు !

నర్సు: (నవ్వుతూ) నిజం ?

వేణు: నిజంగా నిజం లతా !

నర్సు: నాపిచ్చి వేణూ నిజమే. నేనందంగానే వుంటాను.

వేణు: అమ్మా! (స్పృహ తప్పింది)

డాక్ట: ప్రతిసాని దానికీ నర్సు కోర్సు ఇస్తున్న పద్ధతిలో చాలా
తెలివితక్కువదనం వుంది.

నర్సు: ఉత్తమ సంస్కారం వున్న ప్రజ్ఞావంతులకే డాక్టరు
ఉద్యోగాలిస్తున్న పద్ధతిని నేను ప్రశంసిస్తున్నాను
డాక్టర్ !

డాక్ట: (చికాకుగా చూచి వూరుకుంటాడు)

నర్సు: వేణు బ్రతుకుతాడు.

డాక్ట: స్పృహ వస్తే తెలుస్తుంది.

నర్సు: స్పృహ వచ్చి కాన్షియస్‌గా వుంటే మరణం వుండదు
కదూ !

డాక్ట: అప్పటి మాట !

వేణు; అబ్బా !

నర్సు: డాక్టర్ ! వేణు అమ్మా అనలేదు.

డాక్ట: పెద్ద గొప్ప – టెంపరేచర్ చూడు !

నర్సు: అక్కర్లేదు.

పాప: (తెరలో) అమ్మా! అమ్మా!

నర్సు: వస్తున్నా! ఆఁ బాబు!

(మెటర్నిటీ వార్డులోంచి స్త్రీ అరుపులు. మరు క్షణంలో అప్పుడే ప్రపంచం చూచిన పాప ఏడుపు.)

వేణు; డాక్టర్!

డాక్ట: యస్ మిష్టర్!

వేణు: జ్వరంతో హాస్పటల్లో చేరాను. చేరిం తరవాత నాకు స్పృహ లేదు. చాలా టైమ్ గడచినట్లు ఫీల్ అవు తున్నాను. బలహీనంగా వుంది. నాకిప్పుడు ఆరోగ్యం ఎలావుంది. చెప్పండి డాక్టర్!

నర్సు: మీరు హాస్పటల్లో చేరి నాలుగు రోజులయింది. మీ కిప్పుడు పూర్తి స్వస్థత చేకూరింది. అయినా మరి కొంతకాలం మీరిక్కడే వుండటం అవసరం కావచ్చు.

వేణు: నాకు పరీక్షలు......

నర్సు: ఫరవా లేదు.

వేణు: ఈ నాలుగు రోజులునుంచి నా కేమీ తెలియదు. స్పృహలేదు. ప్రపంచం ఎరుగను. మీ పరిచర్యకు థాంక్స్ సిస్టర్!

నర్సు: (ఆశ్చర్యంగా) సిస్టర్! (సంతోషంతో) సిస్టర్. అవును సిస్టర్ని, మిష్టర్ మీకే కాదు. ప్రపంచానికి సిస్టర్ని. సర్వ మానవ చైతన్యానికి సిస్టర్ని. మానవత్వానికి సిస్టర్ని. సిస్టర్ని మిష్టర్. సిస్టర్ని.

వేణు: ఏమిటి సిస్టర్ అంత సంతోషం.

నర్సు: నథింగ్ మిష్టర్ !
వేణు: నాకేమీ అర్థం కావటంలేదు.
నర్సు: గుడ్, డాక్టర్ !
డాక్ట: యస్ !
నర్సు: అయిదు గంట లయిపోయింది.
డాక్ట: అవును.
నర్సు: మీరు శాన్షియస్‌గా వున్నారు.
డాక్ట: అవును.
నర్సు: ఇప్పుడు పోయి రిపోర్టు వ్రాసుకోండి. ప్రవర్తన అస
భ్యంగా వుందని – మీ యిష్టం – ఏ దేవుడైనా
సాక్ష్యం వేసుకోండి.
డాక్ట: సారీ సిస్టర్ !
నర్సు: డోన్‌ట్ వరీ డాక్టర్ !
డాక్ట: థాంక్సు సిస్టర్ ! ఇవాళ నీ హృదయంలోఉన్న ఏదో
క్రొత్త వెలుగు దర్శిస్తున్నాను.
నర్సు: కేస్ సక్సెస్ అని డి. యమ్. ఓ. కి ఫోనుచేయండి.
డాక్ట: వస్తాను ( వెళ్ళిపోయాడు)
వేణు; సిస్టర్ నేను చనిపోయే వాడ్నా ?
నర్సు; లేదులెండి !
వేణు; మీ మాటలు నాకు అలా అనిపించాయి.
నర్సు; నాలుగు రోజులు స్పృహ లేకుండా పోతే కొంచెం
భయపడ్డాం. స్పృహ వచ్చింది. కనుక భయం లేదు.
వృద్ధు; అమ్మా ! నరసమ్మతల్లీ ! ! అమ్మా !
నర్సు; (ప్రేమగా) అయ్యా ! వస్తున్నా !

పాప; అమ్మా ! అమ్మా !

నర్సు; (ముద్దుగా) బాబూ ! వస్తున్నా !

డాక్టర్; సిస్టర్ ! సిస్టర్!

నర్సు; (డ్యూటిఫుల్‌గా) యస్ డాక్టర్ ! వస్తున్నా !

వేణు; సిస్టర్ ! సిస్టర్ !

నర్సు; (ఆత్రుతగా) యస్ మిస్టర్ ! వస్తున్నా !

పాప; (గారాం చేస్తున్న ధోరణిలో) అమ్మా ! అమ్మా !

నర్సు; (ప్రేమగా, ముద్దుగా, ఆనందంగా) లేదు బాబూ ! వస్తున్నా (కదిలింది.)

— తెర వాలుతుంది —

— o —

# దృష్టి

ఆలిండియా నాటికల పోటీలో

ద్వితీయ బహుమతి.

(57 – 58)

ఆకాశవాణి, హైద్రాబాద్, విజయవాడ కేంద్రాలలో

ప్ర స ర ణ.

(19—8—58)

హైద్రాబాద్ జూబిలీ హాలులో,

విశాఖ మెడికల్ కాలేజీ లేడీస్ అసోసియేషన్ వార్షికోత్సవంలో,

విజయనగరం సాంస్కృతికోత్సవాలలో,

ప్ర ద ర్శ న

భా ర తి లో

ప్రచురణ

(డిసెంబరు 58)

పాత్రలు :

హేమలత

| | |
|---|---|
| రమేష్‌బాబు | గంగాధరం |
| డాక్టరు | నరసమ్మ |

(పడక గది. గదిమధ్య మంచం. మంచం తలగడదగ్గర కుర్చీ. ఎదురుగా మరొక కుర్చీ. రెండు కుర్చీలమధ్య స్టూలు. గది కుడిప్రక్క బయటికి వాకిలి. ఎదుట లోపలికి తోవ. ఎడంప్రక్క కిటికీ.

తెర లేచేసరికి స్టూలుమీద కాఫీ కప్పులతో ట్రే వుంటుంది. తలగడదగ్గర కుర్చీమీద గంగాధరం కూర్చుని వుంటాడు. స్టూలు ప్రక్కగా నరసమ్మ వుంటుంది. హేమలత కట్లు కళ్ళతో మంచంమీద కూర్చుని వుంటుంది.)

గంగాధరం: అమ్మా!
హేమలత: ఏం నాన్నా!
గంగా: కాఫీ ఎలా వుందీ?
హేమ: చాలా బాగుంది నాన్నా! కన్న తల్లి లాంటిది మన దాది.
గంగా: మీ అమ్మే వుంటే నీకిన్ని కష్టా లుండకపోయేవి.
హేమ: అదేమిటి నాన్నా! నా కిప్పుడేం?

గంగా: ఏవమ్మా! ఆవిడే వుంటే ... (బాధపడి... తేరుకొని) విధివ్రాత ఎవరు తప్పిస్తారు, నీ కళ్ళే మవుతాయో! భగవంతుని కరుణ ఎలా వుందో?

హేమ: (బాధగా) డాక్టరు చెప్పారుగా నా కళ్ళు వస్తాయని రాత్రి నువ్వూ చెప్పావు - నా కళ్ళు వస్తాయని డాక్టరు చెప్పారని. నువ్వు ఇప్పుడు బాధపడట మెందుకు నానా!

నరసమ్మ: అది మీ నాన్నగారి అనుమానంగాని తప్పకుండా నీ కళ్ళొస్తాయి తల్లీ!

హేమ; నిజంగానా? మా అమ్మలాగా నన్ను కళ్ళల్లో దీపాలు పెట్టుకొని రాత్రీ పగలూ అనకుండా చూస్తు న్నావు. నీ ఋణం తీర్చుకోవటం కష్టం.

నర; పిచ్చితల్లి! పడుకో! ఎక్కువగా మాట్లాడకు!

హేమ; ఇవాళ డాక్టరుగారు నా కట్టు విప్పుతా నన్నారుగా నీతో ఏమైనా చెప్పారా?

నర; చెప్పారమ్మా, నీ కళ్లు తప్పకుండా వస్తాయనీ. ఇవాళ కట్లు విప్పుతారు.

హేమ: నేను వారిని చూడలేదుగాని, వారి హృదయం మాత్రం చూడగలుగుతున్నాను. చాలా కరుణా మయం. నెలరోజుల్నుంచి హైంకు వచ్చి శ్రద్ధతీసుకొని నన్ను చూస్తున్నారు.

గంగా: మంచివాడు. మొన్న మొన్ననే ప్రాక్టీసు పెట్టాడు. ఎంతో మంచి డాక్టరని ఉత్సాహ వంతుడని అప్పుడే నలుగురూ అనుకొంటున్నారు.

నర: వాయన్నదాన్ని ఉన్నట్లు చెప్తారమ్మా! సూటిగా వెలిగే పద్ధతి వారిది. వారవుతుందంటే అవుతుంది. లేదంటే లేదు. అంతే!

హేమ: అయితే నాకు చూపు తప్పకుండా వస్తుందన్న మాట.

నర: చూపు తప్పకుండా వస్తుంది. ఎందుకమ్మా అంత భయం?

హేమ: నాన్నా! ఇవాళ చాలా ఆనందంగా వుంది.

గంగా: నెలరోజులు తరవాత...అదృష్టవంతురాలివమ్మా!

నర: కన్నకూతురు మరి. కళ్ళకు వచ్చింది.

గంగా: నరసమ్మా! కాఫీ కప్పులు పట్టుకెళ్ళు.

నర: సరేనండి (కప్పులుతో (ప్లే)టే తీసుకుపోయింది.

హేమ: నాన్న! మనదారి మంచిది.

గంగా: అవునుగానీ......

హేమ: ఏం నాన్నా!

గంగా: రమేష్ వస్తున్నాడు!

హేమ: (తడబడుతూ) ... బావ! ...

గంగా: అవునమ్మా! నిన్న ఉదయం మెడ్రాసు వచ్చాడు.

హేమ: బావదగ్గర డబ్బుందో? లేదో??

గంగా: మీ బావకు నేను ఎన్నడైనా డబ్బు విషయంలో లోపం కలుగజేశానా? ఎక్కువే పంపా!

హేమ: ఇక్కడికి బావ ఎప్పుడొస్తున్నాడు నాన్నా?

గంగా: నిన్న సాయంకాలం టెలిగ్రాం ఇచ్చాడు బయలుదేరుతున్నట్టు. నిన్న జనతాకి బయలుదేరినా తొమ్మిదిన్నర కల్లా వస్తాడమ్మా!

హేమ: తొమ్మిదింటికే వస్తాడు నాన్న !

గంగా: అప్పసమ్మా !

హేమ: అయితే కారు స్టేషనుకు పంపు. వీలుంటే నువ్వూ కూడా...వస్తావులే నాన్నా ! ఇక్కడే వుండు.

గంగా: అలాగ్గేనమ్మా

హేమ: నాన్నా !......ఫారిన్ వెళుతున్నప్పుడు చూశాను బావను. మళ్ళీ ఇదే చూడబోవటం. ఈ కట్లుతో ఎలా నాన్న ? డాక్టర్ని పిలవ్వా ?

గంగా: సరేనమ్మా !

హేమ: నాన్నా ! నాన్నా !! జసతా కరెక్టు టైమేనేమో కనుక్కో !

గంగా: సరేనమ్మా! డాక్టరూ వస్తాడు రమేషూ వస్తాడు. డాక్టర్ ముందుగా వచ్చేట్టు చూద్దాంలే – అమ్మా ! ఏవిటి నీరసంగా వున్నావ్. జ్వరంగా వుందా ?

హేమ; నీరసమూ, జ్వరమూ – ఏవిటినాన్నా నువ్వనేది?

గంగా; ఏవిటోనమ్మా, నీముఖం పేలవంగా జీవకళ లేకుండా వుంది.

హేమ; అదేవిటినాన్న ! నా కివాళున్నంత ఆనందంగా ఎప్పుడూ లేదు. కాని – ఒకటి అనుమానంగా వుంది.

గంగా; అనుమానా లేవిటీ ?

హేమ; నా కళ్ళొస్తాయో? రావో ? ?

గంగా; తప్పకుండా వస్తాయి. భయపడకు. ధైర్యంగా వుండాలిమరి.

హేమ; బావ నన్నొక వేళ......

గంగా; బావ నిన్నొక వేళ...ఏమిటమ్మా ?
హేమ; కళ్ళు రాకపోతే పెళ్ళి చేసుకోడేమో?
గంగా; అమ్మా ! అదా నీ భయం. అందుకా ముఖం అలా పెట్టుకున్నావ్. అతనికి హృదయమున్న సంగతి నాకంటె నీకే బాగా తెలుసు. అతను కృతఘ్నుడుకాడు. అయినా నీకు చూపు తప్పకుండా వస్తుంది. భయపడ నక్కర లేదు.
హేమ; నిజంగానా నాన్నా ? నిజంగానా ? ?
నర; (లోపల్నుంచి వచ్చి) పిచ్చితల్లి ముఖంలో ఇప్పుడు వెలుగు రేఖలు చూస్తున్నాను.
హేమ; ఏమిటి నరసమ్మా ?
నర; నిజమేనమ్మా ! ఇప్పుడు కళకళ లాడుతున్నారు మీరు.
హేమ: నాన్నా ! టైమెంత ?
నర; రమేష్ ఇంకోగంటా గంటన్నరకల్లా వచ్చేస్తాడు వచ్చేస్తాడు లే అమ్మా !

(తెరలో టెలిఫోను మ్రోగింది)

హేమ: బావ స్టేషనుకు వచ్చి ఫోను చేస్తున్నాడేమో చూడు నాన్నా !

(తెరలో టెలిఫోను మళ్ళీ మ్రోగింది)

గంగా: నరసమ్మా ! పోయి ఫోను చూడు !
నర: సరేనండి (లోపలికి పోయింది)

(తెరలో గోడగడియారం ఎనిమిది గంటలు కొట్టింది)

గంగా: అప్పుడే వస్తుందటమ్మా రైయిను. తప్పకుండా తొమ్మిదింటికల్లా వస్తాడమ్మా !

హేమ: నాన్నా !

గంగా; ఏమమ్మా! తప్పకుండా తొమ్మిదింటికి వస్తాడు.

నర; (వచ్చిగంది) తప్పక వస్తారటగాని తొమ్మిదింటికి కాదట తొమ్మిదిన్నర తర్వాత. పేషెంట్లు బాగా వున్నారట, ఒక కేసు సీరియస్‌గా వుందట.

గంగా; అవును మరి. డాక్టరు! అర్జంటు కేసులుంటాయి. అయినా నరసమ్మా! మళ్ళీ ఫోను చేయి, అమ్మాయి ఎదురు చూస్తోందని చెప్పు. వీలైనంత త్వరగా రమ్మను.

హేమ; బావ వస్తాడు. చూడాలి. కట్టువిప్పాలి. బావ వస్తాడు. తొమ్మిదిలోగా వెంటనే డాక్టర్ని రమ్మని చెప్పు!

నర; సరేనమ్మా !

హేమ; డాక్టరు వేగమే రావాలి. కట్టు విప్పాలి. బావవస్తాడు. నాకు కళ్ళువస్తాయి. బావ వస్తాడు. నాకు కళ్ళు వస్తాయి.

గంగా; అవునమ్మా!

హేమ; నాన్నా! బావ! అమెరికా వెళ్ళేటప్పుడు కన్నీటికి నోచుకున్న నా కళ్లు... ఇవాళ...

గంగా; అవునమ్మా !

హేమ; నాన్నా !

గంగా; ఏదమ్మా?

హేమ; బావకు నాకళ్ళ విషయం తెలుసుకదూ !

గంగా; రమేష్ ఆఖరి మూణెల్లూ అసలే తీరిక వుండదని వ్రాశాడుగా. వచ్చేముందే చివరి ఉత్తరంలోనే నీకళ్ళ

విషయం రాశాను. ఆ ఉత్తరం అందిన వెంటనే బయలు దేరాడు – నరసమ్మా ఫోను చేశావా? ఏమన్నాడు?

నర; డాక్టరు వెంటనే బయలుదేరుతున్నానని చెప్పారమ్మా!

గంగా; అయితే తప్పకుండా వస్తాడు. సరేగానీ జ: తా కరెక్టు టైమేనేమో కనుక్కో!

హేమ; ఆఁ! జనతా కరెక్టు టైమెమో తెలుసుకో!

నర; సరేనమ్మా!

హేమ; బావ ఎలా వున్నాడో?

గంగా; ఏమీ కొరత లేకుండా వుంది కదమ్మా. చీకూ చింతా లేకుండ చేశానుగా. అన్నివిధాలా అభివృద్ధి చెందు తాడు. అసలు మన రమేష్ చాలా అదృష్టవంతుడు. నీ అనుగ్రహం లభించింది. నా ఆశ్రయం దొరికింది.

హేమ; (బాధగా) ఏమిటి నాన్నా!

గంగా; అవునమ్మా! అందుకే అందరికీ అందుబాటులో వుండని అనుదిరకా ... కావు, ఏనాడో యస్. యస్. యల్. సీ. పరీక్షకు ఫీ లేక చదువు మానుకోవాల్సిన అతను, ఆ ఫ్రెండ్స్‌లో ... చదువుతో అవస్థపడే అతను, ఒక ఫారిన్ డాక్టరేట్ తెచ్చుకుంటున్నాడంటే అదృష్టవంతు డటావా? కాదా?? అతనికి పరిస్థితులన్నీ అను కూలించాయి.

హేమ; (కోపంగా) నాన్నా! ఏమిటి నువ్వనేది?

గంగా; అదిగాదమ్మా... (మారుస్తూ) ఒక ఫోటో పంపాడు. అందులో చాలా అందంగా వున్నాడు. ఎంతో ఆరో

గ్యంగా వున్నాడు. ముఖంలో జీవకళ తొణికిసలాడుతూ వుంది.

నర; జనతా కరెక్టు టైమేనటండీ!

గంగా; అమ్మా!

హేమ: ఏం నాన్నా!

గంగా; నేనలా బయటికి పోయివస్తా!

హేమ; సరేనాన్నా! (గంగాధరం వెళ్ళిపోయాడు) నరసమ్మా!

నర; ఏమమ్మా!

హేమ; నన్ను కిటికీదాకా నడిపించు!

నర; ఎందుకమ్మా!

హేమ; కూర్చో లేకపోతున్నా! పడుకో లేకపోతున్నా! నడవాలనిపిస్తోంది. గుండె తేలిగ్గావుంది. నడిపించు.

నర; అసలే ఓపిక లేదేమో!

హేమ; ఓపికేం? దివ్యంగా వుంది. నడిపించుదూ కాస్త!

నర; సరే! లే అమ్మా — — ఆఁ — — చేయి — — భుజం — — ఇటు — — ఇటు — — ఆఁ — — ఆఁ — — నిలబడమ్మా — — ఇంక నడువు — — మెల్లగా — — మెల్లగా నమ్మా — — ఏమిటమ్మా — — అంత హుషారుగా వున్నారు — — ఇటు — — ఇటమ్మా — — ఇక్కడ — — ఆఁ — — అఁ — — నిలబడు — — ఇదిగో — — ఇదీ — — పట్టుకో — — ఆఁ! (ఎడంపక్క కిటికీదగ్గరకు చేరారు)

హేమ; చల్లగా గాలి వీస్తోంది.

నర; మన యింటిముందు పూలమొక్కలు మీదుగా వచ్చిన గాలి పరిమళంతో వస్తుందమ్మా!

హేమ; మల్లెతీగ ఎలావుందో చూడు !

నర; పందిరి మీదకు ప్రాకింది. పూలు పూస్తోంది.

హేమ; క్రోటను మొక్కలు ఎలావున్నాయి.

నర; వాటికేం తల్లి! పనిమనిషి రోజూ నీళ్ళు పోస్తున్నాడుగా. అవి నిగ నిగ లాడుతూవున్నాయి. సన్న జాజితీగకూడా పందిరిమీదకు ప్రాకుతోంది. ప్రక్కనే ముద్దబంతి మొక్కలు బాగానే వున్నాయి.

హేమ: వాటి ప్రక్కనే గులాబీ తీగె లుంటావికదూ !

నర: ఉన్నాయి, బాగా పూచి.

హేమ: అవి తలలో తురుంకుంటే ఎంతో అందంగా వున్నట్లు ఆనందించేదాన్ని.

నర; 'హేమ అసలే దీపకళిక. పైగా గులాబీ పువ్వులు పెట్టుకొని మరీ పూచిన తంగేడులా వుందికదూ!' అనేవారమ్మా మీ బావ.

హేమ; బావ నన్ను నవ్వించి, ఆనందించేట్టు చేయటానికి.

నర; కాదమ్మా! సాధారణంగా అప్పుడు నిన్ను చూచిన ఏ మగాడైనా తన్మయుడౌతాడు. ఏయువతి చూచిన ముఖం చిట్లించి కుళ్ళుకుంటుంది.

హేమ; అలా చూడు! పోకచెట్లు కెదురుగా గన్నేరు చెట్లుండాలి.

నర; ఉన్నాయమ్మా, పచ్చని పూవుల్తో.

హేమ; ఆ చెట్లక్రింద పచ్చని గరికమీద బెంచీ వుందికదూ!

నర; అవునమ్మా! నెల రోజుల్నుంచి వాడుక లేకుండావుంది.

హేమ; బావ ప్రయాణానికి నెల రోజులు ముందు ఆ బెంచీ మీాద తన కౌగిట్లోకి నన్ను చేర్చుకొని 'హేమా, నువ్వు లేకుండా నేను కాలమంతా ఎలా గడపగలను'

సర; అంతలో నేను వచ్చి భోజనానికి రమ్మంటే వచ్చారు కదూ!

హేమ; అవును. బావ వెళ్ళిపోయే రోజు, సరిగ్గా ఇదే కిటికీ, నాకళ్ళల్లోకి చూస్తూ ఏమేమో చెప్పాడు. నేను, 'బావా ఈ కాలమంతా ఎలా గడిపేది? ఇంతవరకు కలిసి మెలిసి వుండి చదువుకున్నాం. ఇంక ఎలాగా...'

సర; అప్పుడు నాన్నగారొచ్చి, 'రమేష్ ట్రెయిన్ టైం అయింది. త్వరగా తెమలండి అన్నారు.

హేమ; అవును. అప్పుడు వెంటనే చీలిపోయాం. ఇవాళ బావ వస్తున్నాడు. నాకళ్ళొస్తాయో? రావో?? బావ ఏమంటాడో? ఏమో??

సర; భయపడకమ్మా! రమేష్ నిన్ను ఏ పరిస్థితుల్లోనూ కాదనడు. నీకళ్ళు తప్పకుండా వస్తాయి.

(తెరలో కారు హారను)

హేమ; అదుగో బావ వచ్చాడు.

సర; ఇంత త్వరగా బావ వస్తాడటమ్మా! మరీ ఓపిక లేకపోతే ఎలా – డాక్టరొచ్చాడు.

హేమ; (సంతోషంతో) డాక్టర్! డాక్టర్!

డాక్ట; హల్లో – ఏమిటి కిటికీదగ్గర చేరారు – సంతోషంగా వున్నట్టున్నారు – గుడ్ అలా వుండాలి – చల్లనిగాలి

పిలుచుకుంటున్నారు - దట్ ఈజ్ బెటర్. యస్. మర్చిపోయాను. ఆరోగ్యంగానే వుందికదూ - ఇంత వరకు జ్వరం రాలేదుగా - అవును రాదు. రావటానికి వీలులేదు. యస్. పదింటికి విప్పుతాను. కళ్ళొస్తాయి. రమ్మన్నారట. ఏమిటి విశేషం. సీరియస్ కేసొకటుంది అయినా తప్పకుండా రమ్మన్నారని వచ్చాను. ప్రత్యేకంగా విశేషంవుంటే చెప్పండి. హుషారుగా వున్నారు. గుడ్, అలావుండాలి.

నర; బాబూ!

డాక్ట; పదింటికి వస్తాను. అర్జెంటుగా వెళ్ళాలి. వీరిని కొంచెం గాలిలో త్రిప్పు. వస్తాను మరి.

హేమ; పదండి!

డాక్ట; ఏమిటన్నారూ? ఏమిటదీ?

హేమ; కొంచెం ముందుగా కట్లు విప్పాలి. అవసరం.

డాక్ట; కొంచెం ముందుగానా? నోనో - టైమ్ ఈజ్ దేర్ - పదింటికే ఇంకా కట్టు విప్పకూడదు. మీక్షేమంకోసం చెబుతున్న ఓ. కె. వస్తా మరి.

హేమ; ఏమండీ?

డాక్ట; ఏమంటారో చెప్పండి. అటు సీరియస్ కేస్ వుంది. వెళ్ళాలి. ఏదో చెప్పబోయారు. చెప్పండి. నిమ్మళ్ళే.

హేమ; నాకళ్లు...

డాక్ట; డెఫ్‌నెట్లీ, తప్పకుండ బాగవుతాయి. పదింటికే. వస్తా మరి. యస్. ఓ. కె. బై బై. (వెళ్ళిపోయాడు)

(9)

హేమ; ఏంవిటి వారికంత తొందర ? మాటకూడా నిదానంగా మాట్లాడరేం ?

నర; వారి మాటే అంత, ఆలోచన చురుకైంది. అందుకే ఆమాటల్లో ఆ తొందర. ఆయన హాస్తవాసి...

హేమ; అంత త్వరగా వెళ్ళిపోయాడేం ?

" ; అక్కడేదో సీరియస్ కేసట. కాని మీరు ఫోను చేశారనే సరికి అన్ని విషయాలూ అలా వుంచి ఇక్కడి కొచ్చారు.

గంగా; (వస్తూ) జనతా వచ్చిందమ్మా !

హేమ; అవునా నాన్నా !

గంగా; అవును. టైం అయింది. రమేష్ వస్తూ వుండి వుండాలి.

హేమ; నాన్నా ! కారు పంపావుగా ! డ్రైవరుకి బావ గుర్తే నటనా ? మర్చిపోయాడేమో. ఆ మాట అడిగావా ? (తెరలో, గోడ గడియారం తొమ్మిది గంటలు కొట్టుతుంది. గంట గంటకూ మధ్య విరామంలో నరసమ్మ హేమలతల సంభాషణ జరుగుతుంది.)

హేమ; (సంతోషంతో ఏంవమ్మా !

నర; అమ్మా !

హేమ; బావ...

నర; వస్తున్నాడు.

హేమ; నాకు...

నర; ఆనందంగా వుంది.

హేమ; అవును.

నర; అలాగేనమ్మా మరి.

(సంభాషణ ఆగిపోయింది. తెరలో కారు హారను)

హేమ; బావ వచ్చాడు.

నర; అవును వస్తున్నారమ్మా!

హేమ; (పెద్దగా) బావా!

రమేష్‌బాబు; (తెరలో) హేమా!

నర; రమేష్ బాబుగారు ఇక్కడికే వస్తున్నారు. నువ్వు కూర్చోమ్మా! కూర్చో!

రమే; హేమా!

హేమ; బావా!

రమే; ఎలాగైపోయావు హేమా!

హేమ; (నిర్లిప్తంగా) ఆఁ! — ఎన్నాళ్లకొచ్చావు బావా!

(గంగాధరం బైటికి వెళ్ళిపోయాడు.)

రమే; మరి అమెరికా...

హేమ; రెణ్ణెల్లనుంచి ఉత్తరంకూడా వ్రాయలేదేం?

రమే; మూణ్ణెల్లనుంచి థీసీస్ కాపీల హడావుడిలో వుండటం వల్ల తీరుబడిలేక పొరపాటు జరిగింది.

హేమ; పొరపాటేఁవిటిలే బావా!

రమే; బాగా చిక్కిపోయావ్!

హేమ; నేనలా కనిపిస్తున్నానా? బావా! నిన్ను చూచే భాగ్యం లేకపోయింది. డాక్టరుగారు ఇవాళ కట్టు విప్పుతా నన్నారు.

రమే; హేమా! అసలు నీకళ్లేమయ్యాయి.

హేమ; (బాధగా) ఏం చెప్పేది బావ! నెల రోజులక్రితం అదేదో జ్వరం వచ్చింది. నాలుగురోజులు తీవ్రంగా వుంది. నాలుగోరోజు రాత్రినుంచి ప్రారంభం కళ్ళు మసక మసగ్గా కనిపించాయి. నీ ఫోటో దగ్గరకుపోయి చూశా. బావా! ఫోటో కనిపించింది కాని గుర్తు తెలియలేదు.

రమే; (ఆశ్చర్యంగా) ఆఁ!

హేమ; చీకటి కారణమని నిద్రపోయాను. తెల్లవారిం తరవాత లేచాను. మసక మసగ్గ వుంది. రాత్రికంటే కొంచె మెక్కువ. సూర్యుడు పోకచెట్ల మధ్యగావచ్చి కళ్ళలో పడుతున్నాడు. కళ్ళవెంబడి నీరుకారటం మొదలు పెట్టింది. నాన్న ఇంటివద్ద లేరు; బావా! నరసమ్మను కేకేసి చెప్పాను. ఆవిడ పైత్యాన కళ్ళు తిరుగుతున్నా యేమోనని నన్ను కుర్చీలో కూర్చోబెట్టి వెళ్ళింది. కళ్ళు మూసుకుకూర్చున్నాను. కొంచెంసేపట్లో నాన్న వచ్చారు. నన్ను పిలిచారు. లేచాను. కన్ను తెర చాను. నాన్నమాట విన్పించింది. కాని, నాన్న కన్పించలేదు. 'ఏమిటమ్మా వెర్రిచూపు' అన్నారు నాన్న.

రమే; వెర్రి చూపా?

హేమ; నేను భోరున ఏడ్చాను. (కంఠం వణికింది)

రమే; ఎంతపని జరిగింది?

హేమ; నెలరోజుల్నుంచి డాక్టరు శ్రమ తీసుకుంటున్నారు. కళ్ళు వస్తాయని పదేపదే పనికట్టుకొని చెబుతున్నారు. ఇంకో అరగంటకల్లా వచ్చి కట్టు విప్పుతారు.

రమే; డాక్టరు జాగ్రత్తగా చూస్తున్నారా!

హేమ; చూస్తున్నారు.

రమే; నరసమ్మ నిన్ను కంటికి రెప్పలా కాపాడుతూ వుంది కదూ!

హేమ; అవును బావ!

రమే; వీళ్ళిద్దరూ జాగ్రత్తగా చూడకపోతే ఇది చాలా ప్రమాదకరమైన కేసు. కళ్ళు రాని ఇన్సిడెంట్సు కూడా వున్నాయి.

హేమ; (భయంగా) బావా!

రమే; భయపడకు హేమా! కళ్ళు బాగవుతాయని డాక్టరు చెప్పారన్నావుగా. విచారించకు. ధైర్యంగా వుండు. అప్పటి చురుకుదనం నీలో ఏమైంది హేమా! ఇంత నీరసంగా వున్నావ్!

హేమ; అదేమిటీ?

రమే; ఆరోజు మెయిల్ సెకెండు క్లాసులో ఒంటరిగా వున్నప్పుడు...

(తెరలో టేప్ రికార్డు వినవస్తుంది. స్టేజీమీద హేమ కళ్ళకట్టు తడువుతూ పరిశీలిస్తూ రమేష్ వుంటాడు. హేమ పడుకొని వుంటుంది)

రైలుకూత – పోతున్న సవ్వడి క్రమంగా దూరమవుతుంది.

రమే; నాకు తలనొప్పిగా వుంది.
హేమ; కాఫీ యివ్వనా ?
రమే; కళ్ళు తిరుగుతున్నాయి.
హేమ; ఏఁవిటి బావా! ఇంకెవరూ లేరిక్కడ! ఇప్పుడేం చేసేట్టు.
రమే; ఇలా రా హేమా !
హేమ; ఎందుకు బావా !
రమే; ఇక్కడ కూర్చో! ఆఁ !......నాకీబాధా వుండదు. హాయిగా వుంటుంది.
హేమ; ఏఁవిటి బావా !
రమే; అలా కూర్చో! లేవబోకు.
హేమ; ఇదా ఎత్తు !
రమే; కారణం మరి నీకళ్ళు.
హేమ; నాకళ్ళా !
రమే; అవును.
హేమ; ఏం?
రమే; నాకు భయంగా వుంది.
హేమ; ఎందుకూ? ఏమయిందీ? ఏమిటిబావ?
రమే; నీకళ్ళు...
హేమ: నాకళ్ళ కేమిటీ?
రమే; నాకు భయంగావుంది. నన్ను మింగేస్తున్నాయి. నేనిక్కడ కూర్చోలేను.
హేమ; ఏఁవిటీ— పిచ్చిబావా! పాపం అక్కడ పడుకో పో!

రమే; హేమా!

హేమ; ఆఁ!

రమే; భగవంతుడు నీకళ్ళింత అందంగా ఎందుకు తయారు చేశాడు. రైలుకూత - పోతున్న సవ్వడి.

(టేప్ రికార్డు ఆగిపోయింది, హేమలత లేచి మంచం మీద కూర్చుంది)

హేమ; (విచారంగా) ఆకళ్ళిప్పుడు...

రమే; హేమా! విచారం దేనికి. సంతోషంగా వుండు. ఎం శ్రమపడి థీసీస్ సబ్మిట్ చేశాననుకున్నావ్. రాగానే నిన్నుచూచి ఆశ్రమంతా మరచిపోదామనుకున్నా! నువ్విలావుంటే ఎలా హేమా!

హేమ; థీసీస్ బాగా సబ్మిట్ చేశావుగా!

రమే; ఫరవాలేదు. త్వరలోనే డాక్టరేట్ వస్తుంది.

హేమ; ఇంతకాలంనుంచి నువ్వు లేవు. ఇక్కడనాకు ఇన్నాళ్ళూ నిస్పృహగానే కాలంగడిచింది. నువ్వు వస్తావనుకునే సరికి ఇదొకటి.

రమే; విచారించకు హేమా! త్వరలోనే నయమవుతాయి.

హేమ; కాని బావా! అమెరికానుంచి రాగానే మన మేరేజి అన్నావు.

రమే; ఇప్పుడేం?

హేమ; ఏవాఁ?

రమే; అవునిప్పుడేం?

హేమ; ఒకవేళ నాకు దృష్టి రాకపోతే నన్ను...

రమే; రాకేం చేస్తుంది. ఇవాళే కట్టు విప్పుతారటగా!

హేమ; ఒక వేళ దృష్టి రాకపోతే, నేను నీకు...

రమే; డాక్టరు దృష్టి వస్తుందని చెప్పారన్నావుగా!

హేమ; నిన్న మొన్నటి నుంచి మాత్రమే వస్తుంది తప్పక వస్తుంది అంటున్నాడు. కాని అంతకుముందు చెప్ప లేం ప్రయత్నిస్తాననేవాడు. అది తల్చుకుంటే గుండె ఆగినంత పనవుతుంది. అయినా నాకు కళ్ళొచ్చేం దాకా నమ్మకం లేదు.

రమే; తప్పకుండా చూపు వస్తుంది. భయపడకు హేమా!

హేమ; ఒక వేళ రాకపోతే...నాజీవితం...

రమే; ఆలోచింపవలసిన విషయమే!

హేమ; (ఆశ్చర్యంగా) ఆఁ! (భయంగా) ఏమిటీ? (కోపంగా) బావా!

రమే; (మాట్లాడడు)

హేమ; ఏఁవిటీ బావా నువ్వన్నది?

రమే; ఆఁ! ఏముంది? ఏమీ లేదు! ఊరికినే అన్నాను.

హేమ; ఏమనీ? ఆలోచింపవలసిన విషయమనే కదూ?

రమే; పిచ్చి హేమా! నేను నిన్ను తప్ప మరొకర్ని పెళ్ళి చేసుకోగలనా?

హేమ; నిజమా బావా?

రమే; అనుమానం కూడానా! – అది ఖాయం సరేగానీ నేనిక్కడొక ప్రొఫెసర్ని కలుసుకోవాలి! పది దాటేం తరవాత దొరకడు. వారితో మాట్లాడితే రేపు డాక్ట

రేటురాగానే సెంట్రలు అపాయింటుమెంటు జరుగుతుంది. అదీ మన బాగుకేకదా ! పోయి మాట్లాడి వస్తా !

హేమ; డాక్టరు వచ్చే వేళయింది. కట్టు విప్పిం తరవాత పోకూడదూ !

రమే; ఫరవాలేదు హేమా ! పదింటికి డాక్టరు వస్తారు. కట్టు విప్పుతారు. కళ్ళు వస్తాయి. పదింటికి ప్రొఫెసరుతో మాట్లాడతాను. పని జరుగుతుంది. వెంటనే వస్తాను. వస్తా మరి.

హేమ; బావా! నువ్వు హృదయ పూర్వకంగా నాకు కళ్ళు రావాలని కోరుతున్నావా?

రమే; అదేంమాట హేమా!

హేమ; ఏముందీ? నాకు కళ్ళు రావాలని కోరుతావు కానీ కళ్ళు రాకపోతే పెళ్ళి చేసుకోవు కదూ!

రమే; ఏమిటది.

హేమ; ఏముంది. వాస్తవానికి వాగ్రూపం.

రమే; పోయిరావాలి. వస్తామరి.

హేమ; సరే!

గంగా; (వస్తూ) ఎక్కడికి రమేష్.

రమే; ఇప్పుడే వస్తా మామయ్యా !

గంగా; డాక్టరు వచ్చేవేళయింది. కట్టు విప్పిం తరవాత పోకూడదూ!

రమే; అప్పటికి వస్తా మామయ్యా

(వెళ్ళిపోయాడు)

గంగా; అమ్మా రమేషూ......
హేమ; వస్తాడు. నాన్నా! నాకు కళ్ళొస్తాయా?
గంగా; తప్పకుండ.
హేమ; బావ నన్ను పెళ్ళి చేసుకుంటాడని మీకు నమ్మకం వుందా?
గంగా; అదేంమాటమ్మా! అపనమ్మకమా! మీ బావ విషయంలో...
హేమ; కాదు నాన్నా! అసలు జీవితమే ఓ పరీక్ష అందులో మళ్ళీ...
గంగా; అవాంతర పరీక్షలుంటాయా?
హేమ: అవసరమైతే అవి తప్పవునాన్నా!
గంగా: ఏఁవిటమ్మా నువ్వనేది?
హేమ: ఏఁవీ లేదులే నాన్నా!

(తెరలో కారు హారను)

డాక్టరు వచ్చి వుంటాడు నాన్నా!
గంగా; అవునమ్మా! డాక్టరే! (నసుగుతూ) రమేషుకూడా...
హేమ; బావ రాడులే నాన్నా!

(తెరలో గడియారం గంటలు కొడుతుంది)

హేమ; (మొదటి మోత) నాన్నా!
(రెండో మోత) నరసమ్మా!
(మూడో మోత) డాక్టర్!
(నాలుగో మోత) వచ్చారు.
(ఐదో మోత) కళ్ళు.

(ఆరో మ్రోత) బాగవుతాయి.
(ఏడో మ్రోత) నాన్నా !
(ఎనిమిదో మ్రోత) నాన్నా !
(తొమ్మిదో మ్రోత) ...బా...
(పదో మ్రోత) ...వ?...

(లైట్లు ఆరిపోయి వెలుగుతాయి. సీను మారదు. ఎక్కడివాళ్ళు అక్కడే వుంటారు. హేమలత కళ్ళకట్టు వుండదు. తెరలో గడియారం మూడు గంటలు కొడుతుంది.)

గంగా; రమేష్ ఇంకా రాలేదే? ఎలా నిలబడ గలుగుతాడో! ఏమో!

నర; వెళ్ళిన పని అవ్వాలి కదండీ!

హేమ; అవును. కావద్దూ మరి. వస్తూవుంటాను లే జీవితాలు.
(తెరలో కారు హారను)

గంగా; రమేష్ వచ్చాడనుకుంటా!

రమే; (ప్రవేశిస్తూ) హేమా!

హేమ; (సమాధానం లేదు)

రమే; మాట్లాడవేం హేమ? మావయ్యా! ఏఁవిటి మీ ముఖం అదోమాదిరిగా వుంది. లేని నవ్వు తెచ్చుకోడానికా? ఉన్న నవ్వు పోగొట్టుకోడానికా? ఏఁవిటా ప్రయత్నం?

గంగా; (సమాధానం లేదు)

రమే; నరసమ్మా! ఏమిటిదంతా?

నర; అమ్మాయినే అడుగు బాబు!

రమే; హేమ పలకటంలేదు - హేమా!
హేమ; (గద్గద స్వరంతో) ఏం బావా!
రమే; కళ్లొచ్చాయా ?
హేమ; (దుఃఖంతో) అంతభాగ్యమా ?
రమే; రాలేదా ?
ేమ: లేదు బావా !
రమే; కళ్ళు రాలేదా ?
హేమ; (ధైర్యాం తెచ్చుకొని దుఃఖం ఆపుకుంటూ) నిదర్శన ముండగా అనుమానం దేనికి బావా. విధి నన్ను చిన్న చూపు చూశాడు. ఇంతకూ నా అదృష్టం ఇలావుంది.
గంగా; (విచారంగా) నేనలా వెళ్ళివస్తా నమ్మా! (బయటికి వెళిపోయాడు)
రమే: అదృష్టం దురదృష్టం ఏఁవిటి? డాక్టరు సరీగ్గా ట్రీట్ చేయలేదేమో !
నర; నేనిప్పుడే వస్తాను బాబూ !
(లోపలికి పోయింది)
హేమ; అదేమిటి బావా ?
రమే; ఏముంది హేమా! మనిద్దరం ప్రేమించుకున్నామా?
హేమ; ఊఁ !
రమే; పెళ్ళి చేసుకుందా మనుకున్నామా ?
హేమ; అవును.
రమే; నిన్నటిదాకా నువ్వు పెళ్ళికి తగినదానివి. ఇవాళ మాత్రం కాదు.

హేమ; (ఆశ్చర్యంగా) ఆఁ !

రమే; అందుకే అదృష్టంమీద నాకు నమ్మకంలేదు.

హేమ; బావా! ఏమిటామాటలు? నన్ను పెళ్ళి - - -

రమే; నీకు కళ్లు లేవుగా!

హేమ; (దుఃఖంతో) నీకున్నాయిగా? మన జీవితాల కిది పరీక్ష బావా! నాకళ్ళు మరోకట్టుతో రావచ్చునని డాక్టరు చెప్పారు. ఈసారి కట్టుతో కళ్ళు తప్పక వస్తాయి. నన్ను కాదనకు బావా! కళ్ళు రాకపోవు గావా!

రమే; చాల రోజులు ప్రయత్నం చేస్తే రాని నీ కళ్ళు ఇంకో కట్టుతో రాకపోవంటే తెలివైనవా డెవడూ నమ్మడు, నీకు కళ్ళు రావు.

హేమ; బావా?

రమే; హేమా! నీకు కళ్ళు రావటం కష్టం.

హేమ; బావా?

రమే; అంతే హేమా! బాధ ఎక్కువగా ఎందుకు కల్పించు కుంటావ్!

హేమ; నా కళ్ళు అందంగా వుంటాయనీ - - - -

రమే; నేనొప్పుకుంటాను. కాని కళ్లు లేని నీ ముఖంలో ఏ కళా కాంతులూ వుండవని నీకు తెలుసు.

హేమ; డాక్టరు కళ్లు రావచ్చు నన్నారు బావా?

రమే; డాక్టర్లు అలాగే అంటారు.

హేమ; మా నాన్న చాలా ధనవంతుడు.

రమే; కావచ్చు.

హేమ; బాగా పోలముంది.

రమే; లేదని ఎవరూ అనరు.

హేమ; దివ్యమైన మేడలు మూడున్నాయి. నేనొక్కదాన్నే వారి సంతానం నీకు తెలుసుగా బావా!

రమే; మీ నాన్న తలుచుకుంటే రేపీపాటికి నీకు పాతిక పెళ్ళిళ్ళు చేయించగలడు.

హేమ; (కోపంగా) బావా?

రమే; అంతే కాదు. లక్ష మందిని పోషింపగలడు. అయితే దాని వెనక భయంకరమైన స్వార్థం పేరు ప్రఖ్యాతుల కోసం వళ్ళు విరుచుకుంటుంది.

హేమ; నిన్ను కూడా...

రమే; (బాధగా) అన్నావా హేమా! పోషించాడు. పెద్ద వాణ్ణి చేశాడు. ఆ మాటలు తప్పకుండా ఒప్పుకుంటాను. (కోపంగా) కానీ నిలువెల్లా విషం కక్కుతూ పొగలు బుసలు కొడుతూ స్వార్థ పిశాచి టెర్రిఫిక్ డాన్సు.

హేమ; ఏమిటి నువ్వనేది?

రమే; నువ్వు నన్ను ప్రేమించకపోతే. రెక్కలులేని పక్షినైన నాకు ఒక గూడంటూ లేకపోయేది. అలాంటి మంచి ఆశ్రయం దొరికిందంటే కూతురికి నచ్చినవాడు అల్లుడు కాబోతున్నాడని. చెల్లెలు కొడుకుని చేరదీసి పెద్ద చేశాడని లోకం అనుకుంటుందనే మీ నాన్న స్వార్థమే. కారణం నీ అనుగ్రహం.

హేమ; కాదు మా నాన్న నిన్ను చెల్లెలు కొడుకువనే ప్రేమతో చేరదీశాడు.

రఘు: ఆమాటే నేను ఒప్పుకోను. మానాన్న పోయింతరవాత ఒక్కగా నొక్కణ్నే సంతానమైన నన్ను చదువాపకుండా చేయాలనే పట్టుదలతో మా అమ్మ మీ నాన్న దగ్గరకు వచ్చి డబ్బు అడిగితే, ఆయన అడిగిన మాటలూ, తిట్టిన తిట్టులూ, డబ్బు పంపుతూ నువ్వు వ్రాశావు గుర్తుందా? ఆ తరవాత -- (గొంతుగాద్గదికమయింది) మా అమ్మ ఇంటికి తిరిగి రాలేదన్న సంగతి కూడా నీకు తెలుసుగదూ! (బాధతో) నాకు హృదయం లేదు కానీ వుంటే ఏనాడో పగిలిపోవలసింది.

హేమ: నీకు హృదయం లేదన్న సంగతి వేరే చెప్పక్కర్లేదు.

రఘు: హేమా!

హేమ: నీకు ఆశ్రయమిచ్చింది మా నాన్న.

రఘు: మా కుటుంబం చితికిపోవటానికి కారణమూ ఆయనే!

హేమ: నీకు నేను — ఏ మపకారం చేశాను బావా?

రఘు; నువ్వు నాకేమీ అపకారం చేయలేదు. నేను నిన్ను ప్రేమించింది కూడా మీ నాన్న ఆస్తిపాస్తులు చూచి కాదు. ఆ తరవాత ఆ ఆస్తి ఉపయోగపడుతుంటే అవసరాల్లో వున్నాను కనుక కాదూ కూడదూ అనలేదు, నేను నీ అందాన్ని చూచి --

హేమ: మరీ --

రఘు; దాసోహమన్నాను. నీకు అన్యాయం చెయ్యాలన్న భావం నాకెప్పటికీ లేదు. నిన్ను నేనెందు కారాధించానో అదీనాడు నీలోలేదు. నిన్ను నేను కాదనటానికి కారణం నువ్వు గంగాధరం కూతురు వవటం కాదు.

హేమ: నిన్ను నేను ఏ పరిస్థితుల్లోనూ వదిలిపెట్టనన్నావుగా బావా ?

రఘు; అవును హేమా ! కానీ నేనీనాడు ఒక గెజెటెడ్ ఆఫీసర్ను కాబోతున్నాను. నా గౌరవ మర్యాదల విషయం ఆలోచించు. ఒక గెజెటెడ్ ఆఫీసరు ఒక గుడ్డిపిల్లతో కాపరం చేస్తూ పొందే గౌరవం ఏమిటి ?

హేమ; బావా నీకు నేను ఏ విధంగానూ అడ్డం లేకుండా వుండటానికి ప్రయత్నిస్తా. నీ పాదసేవ చేస్తా, ఆరాధిస్తా. పువ్వుల్లో పెట్టుకొని పూజించుకుంటా. నన్ను పెళ్ళిచేసుకో. మానాన్న కారణంగా నన్ను బలిచేయవద్దు.

రఘు; హేమా ! నీవు నన్ను హృదయపూర్వకంగా ప్రేమిస్తున్నావా ?

హేమ: ఏమిటి బావా ! కొత్తగా ?

రఘు; అదికాదు హేమా ! నీ హృదయ నైర్మల్యాన్ని, పవిత్రతనీ, గాంభీర్యాన్ని అర్థం చేసుకోలేక కాదు సమాధానం కావలసి – –

హేమ; నీకు తెలుసుగా !

రమే; నేను క్షేమంగా, సంతోషంగా వుండటం నాకిష్టమే కదూ?

హేమ; నే నింకెవరి క్షేమం కోరగలను?

రమే; అయితే దయతలచి మన పెళ్ళి ప్రస్తావన తేవొద్దు.

హేమ; బావా?

రమే; ఆపిలుపుకింక అనర్హున్నేమో హేమా!

హేమ; బావా?

రమే; ఆపేరుతో నన్ను పిలవకుండా వుండకూడదూ!

హేమ; (కోపంగా) మిష్టర్ రమేష్! తప్పకుండ అనర్హుడివి. ఇంక ఆపేరుతో పిలవను.

రమే; హేమా?

హేమ; డోన్టాక్. నాకు కళ్లులేవు?

రమే; హేమా?

హేమ; ఆవిధంగా పిలవకు మిష్టర్ రమేష్.

రమే; హేమా?

హేమ; నోరు మూసుకో నీకు హృదయంలేదు.

రమే; హేమా?

హేమ; మిష్టర్ రమేష్, నోరుమూసుకుంటే మంచిది.

రమే; మీనాన్న డబ్బుచూచి కాకుండా నీ అందంచూచి నిన్ను ప్రేమించాను. నీనాన్న చెడ్డపనులు కారణంగా నిన్ను విడవటంలేదు. నీదృష్టిలోపం నన్ను కలవర పెడుతోంది. నిన్ను పెళ్ళిచేసుకోలేను.

హేమ; రమెష్! మిష్టర్ రమేష్! రమేష్!

రమే; గుడ్డిదానితో నేను పొందే గౌరవమేముంటుంది. ఎంత కాలం సుఖంగా జీవించగలను. ఆలోచించు హేమా! నేనుసుఖంగా జీవించాలనీ, ఏదో ఉన్నతదశ పొందాలనీ ఏదో మధురానుభూతి పొందాలని అనుకోవటంలో తప్పు ఏముంది. ఆలోచించు. నేను నిన్ను ప్రేమించిన భావ ననుకోకుండా డాక్టరేటున్న పౌరుణ్ణని వూహించు. ఒక గుడ్డిపిల్లను పెళ్ళి చేసుకోవచ్చునేమో? ఆలోచించు!

హేమ; నీకు తెలియని ఏదో బ్రహ్మాండాని బద్దలుచేస్తూ హాయిగా కూర్చో.

రమే; నన్నర్థం చేసుకోవటం లేదు.

హేమ; లేదు. అర్థం చేసుకున్నాను. నేను, పెళ్ళికాక, పెళ్ళి చేసుకునే మగాడులేక కళ్ళులేక, కళ్ళులేని లోకంలో – అందులో నీలాంటివాళ్ళ మధ్య, జీవితమంతా, ముసలిదాన్నయ్యేదాకా, అష్టకష్టాల పాలవుతూ నాశనమై పోతాను.

రమే; నా ఉద్దేశ్యం అది కాదు.

హేమ; మరేమిటి?

రమే; నీకు కళ్ళు లేకపోవటం – –

హేమ; నువ్వు ప్రేమించింది నన్నా? నాకళ్ళనా? – –

రమే; నిన్నే! కానీ – –

హేమ; కళ్ళుండి హృదయం లేని స్త్రీ కావాలా? నన్ను నువ్వు పెళ్ళాడినా, కారణం నా కళ్ళూ, నా అందచందాలూ కావు. మన ప్రేమ అది మరచిపోకు రమేష్.

రమే; నాగౌరవ మర్యాదల విషయం ఆలోచించటంలేదు నువ్వు!

హేమ; నాజీవితాన్నిగూర్చిమాత్రం నువ్వుఆలోచిస్తున్నావా?

రమే; ఏంవాలోచించను ?

హేమ; కళ్ళు లేనంతమాత్రాన నాజీవితం నాశనం కావలసిందేనా ?

రమే: కళ్ళులేని నిన్ను కట్టుకొని నా గౌరవ మర్యాదల్ని మంట కలుపుకోవలసిందేనా ?

హేమ: నీ గౌరవంకోసం నా జీవితం నాశనం కావాలంటావ్?

రమే: నీ జీవితంకోసం నా గౌరవం నాశనం కావాలని నువ్వంటున్నావ్.

హేమ: గౌరవం, జీవితం ఒకటేనంటావ్ రమేష్! నీవంటి మహామేధావి డాక్టరేట్‌తో ఫారిన్ రిటర్న్డు ఓ అంధురాలిని పెళ్ళాడితే అబ్బ! ఎంత త్యాగపురుషుడో అని లోకం గౌరవిస్తుంది. గమనించు. నన్ను పెళ్ళాడటం వల్ల నీగౌరవం పెరుగుతుందేకాని తరిగిపోదు. అలా నువ్వు పెళ్ళాడకపోతే, గుడ్డితనం కారణంగాకాక ప్రేమ కారణంగా నా జీవితం నాశనమవుతుంది. నిజంగా నేను నిండు కన్నులతోవున్నా నన్ను నువ్వు పెళ్ళాడినా, కారణం నాకళ్ళూ, నా అందచందాలూకావు. మనప్రేమ. అది మరచిపోకు రమేష్.

రమే; మనప్రేమ నిజమే హేమా! ఇప్పటికీ మనస్ఫూర్తిగా నీమీద నాకు ప్రేమవుంది. కాని ఒక అంధు

రాల్ని భార్యగా స్వీకరించి ఆజన్మాంతం అవస్థమాత్రం పడ్డేను.

హేమ: అంతేనా రమేష్ ?

రమే; అంతే హేమా!

హేమ: అంతేకదూ?

రమే: అంతే!

హేమ: సరే! రమేష్! నిజంగా నీకు నామీద ప్రేమలేదు. నాకళ్ళూ నా అందచందాలూకంటే నా డబ్బుమీద నీదృష్టి, నీచదువుకీ, నీగొప్పకీని. మనసిచ్చానన్నదే నాదృష్టి. అయితే నాడబ్బుతో నీఅవసరం తీరిపోయింది, ఫాల్స్ప్రిస్టేజ్ ఓకుంటిసాకుగా తప్పించుకోవాలని ప్రయత్నిస్తున్నావ్.

రమే: నా డబ్బుకోసం నిన్ను ప్రేమించానంటావ్. పైగా నా స్థితిగి ఫాల్స్ప్రిస్టేజ్ అంటున్నావ్. ఇంకా ఏమైనా అనగలవు. ఏఁదన్నా నేను అంధురాలి భర్తను కావటం అసంభవం.

హేమ: అంధురాలి భర్త! రమేష్! బాహ్యదృష్టిలేని అంధురాలా! ఆంతర దృష్టిలేని అంధురాలా?

రమే:. ఆంతర దృష్టేఁవిటి? అర్థంలేనిమాట!

హేమ: అంటే నీకు అవసరమైన ఆంతరదృష్టి లేదన్నమాట. నిజంగా నువ్వే గుడ్డివాడివి. అంతరాత్మలేని అంధుడివి. మూర్ఖుడివి.

రమే: (తీక్షణంగా) హేమా!

హేమ: రమేష్ నీకు అంతరదృష్టేవుంటే ఆ పేరుతో పిలవ్వు. నువ్వు మూర్ఖుడివే కాదు బుద్ధిలేనివాడివి.

రమే: అట్టే వాగకు హేమా!

హేమ: అవును వాగటమే అనిపిస్తుంది. బుద్ధివుంటేగా సెల్ఫిష్‌ఫూల్! అనే గ్రేట్‌ఫూల్ రెచ్!

రమే: పటప్ (చెంపమీద కొట్టాడు)

హేమ: అబ్బా!

నర: (లోపల్నుంచి వచ్చింది) బాబూ!

గంగా: (బైటనించి వచ్చాడు) చెయ్యికూడా చేసుకున్నావా రమేష్.

హేమ; చెయ్యేంవిటి? మరేమైనా చేసుకుంటాడు, కళ్లు వుండి కనిపించనివాడు. మిస్టర్ రమేష్ నీకు కావలసి బాహ్య దృష్టి నాకు సరిగ్గానే వుంది. తెలుసా?

రమే: ఆఁ!

హేమ: కళ్ళు లేక చూడలేని దానిని కాదు కళ్లువుండి...

నర: అవును బాబూ! కట్లు విప్పగానే ఉదయం కళ్ళొచ్చాయి.

గంగా: డాక్టరుగారు మంచి ట్రీట్‌మెంటు చేశారు. ఆయనకెంతైనా ఋణపడి వున్నాను. అమ్మాయి నీతో అబద్ధమాడింది. నిన్ను అర్థం చేసుకోవటానికి పిచ్చితల్లి ప్రయత్నం వద్దన్నా విందికాదు.

రమే: నిజంగానా?

హేమ: అబద్ధం? సరేనా?

నర: నిజం బాబు!

గంగా: హేమకు దృష్టి వచ్చింది రమేష్!

హేమ: రమేష్‌కి దృష్టి రాలేదు నాన్నా! మామూలు కళ్లు మాత్రం వున్నాయి. మనుష్యుల హృదయాలు చూచే కళ్ళు లేవు. ఏం రమేష్! నాకు మామూలు కళ్ళు వచ్చాయంటే నువ్వు నమ్మలేక పోతున్నావ్?

రమే: నమ్మలేకుండా వున్నా!

హేమ: నువ్వు నమ్మలేవు. నమ్మే అర్హతా నీకు లేదు. నమ్మినా ప్రయోజనం అంతకంటేలేదు. రమేష్! నాకాౕవలసింది బాహ్యదృష్టి కూడా కాదు. బాహ్యాడంబరం ఇప్పుడు నువ్వు ఇదివరకటి కంటే వేష భాషల్లో ముందడుగు వేశావ్. అది నీ ఫారిన్‌టూర్‌కి ఫలితం.

రమే: ఇదంతా ఏఁవిటి?

హేమ: ఏఁవుంది? స్వర్గం. కాదు నరకం. అయినా తమ కళ్ళకు కృత్రిమమైన కళ్ళజోడు చేరింది. కనుపించదు లే.

రమే: హేమా!

హేమ: అనేకసార్లు చెప్పాను. అలా పిలివ్వద్దని. ఆఖరిసారిగా మరోసారి చెబుతున్నా. బుద్ధివుంటే నన్నింకిలా పిలవకు.

రమే: హేమా!

హేమ: కళ్ళొచ్చాయి కదా పెళ్ళిచేసుకుందామనా — మాటాడవేం?

గంగా: అమ్మాయ్!

హేమ: నాన్నా! ఇది నా స్వంత విషయం. నీకు మేనల్లుడి మీద మమకారం వున్నా రాతి హృదయం కల రమేష్‌మీద నాకు ఎంతమాత్రం అభిమానం లేదు. ఉండదు.

నర: అమ్మా!

హేమ: రమేష్ నీగౌరవానికి లోపంరాని వివాహమే చేసుకో, ఇక వెళ్ళు.

రమే: హేమా!

హేమ: డోన్టాక్!

| | | |
|---|---|---|
| గంగా | ఒక్కసారి | అమ్మాయ్! |
| నర | | అమ్మా! |

హేమ: ఇది నా స్థిరనిశ్చయం. గుడ్డిదాన్ని పెళ్ళాడితే గౌరవానికి లోపంవచ్చే గెజెటెడ్ ఆఫీసరుగారికి నేను తగనిదాన్ని. గుడ్డిదాన్నట! ఎవరుగుడ్డో? ఎవరికి సరైన దృష్టిలేదో??

రమే: క్షమించు హేమా!

హేమ: అనవసరం. నాకు దృష్టిపోయింది. మళ్ళీ వచ్చింది. అసలు నీకు దృష్టి అన్నదేలేదు. అమాయికంగా బావ అని ప్రేమించిన నాలో స్వార్థం వుందన్నావ్. ఆస్వార్థం నీలోనే కరడుగట్టింది. నిజానికి నీకు దృష్టిలేదు. ఏదృష్టి నాకులేదని గౌరవభంగం అనుకున్నావో ఆదృష్టేకాని,

అంతకంటే ఉన్నతమైన ఆంతరదృష్టి నీకులేదు. అలాంటి నిన్ను క్షమించటం అనవసరం.

రమే: హేమా !

హేమ: మిష్టర్ రమేష్ !

రమే: ప్లీజ్

హే: గెటౌట్

రమే: (వెళ్ళిపోతూ) హే...మా...

— తెర పడుతుంది —